# Vidyarangamlo Marpulu Supreem Court Teerpulu

Essays

by
**Dr. Vaddi Vijaya Sarathi**

ప్రథమ ముద్రణ :
చిత్రభాను మార్గశీర్ష బహుళ పంచమి
24-12-2002

ప్రచురణ :
భారత ప్రకాశన్ ట్రస్ట్
ఏలూరురోడ్, విజయవాడ-2.

ముద్రణ :
శ్రీ పాండురంగా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
షేక్‌మొహిద్దీన్ వీధి, విజయవాడ-2.

వెల : రు. 6/-

ప్రతులకు :
సాహిత్య నికేతన్
ఏలూరురోడ్, విజయవాడ-2.
ఫోన్ : 0866 - 5567421

సాహిత్య నికేతన్,
కేశవ నిలయం, బర్కత్‌పురా,
హైదరాబాద్ - 500 027.
ఫోన్ : 040 - 27563236

# ప్రకాశకుల మనవి

గత మూడు నాలుగు సంవత్సరాలుగా దేశమంతటా బహుధా అల్లరి చేయబడిన విషయం విద్యారంగ కాషాయీకరణం. కాషాయ వర్ణం ఈ దేశపు సాంస్కృతిక సంపత్తికి, వారసత్వానికి ఒక ప్రతీక. కాబట్టి విద్యారంగంలో కాషాయవర్ణం ప్రతిఫలించే మార్పులు జరుగుతున్నపుడు వాటిని స్వాగతించవలసిందే.

అయితే ఈ పదాన్ని ఆ అర్థంతో వారు ఉపయోగించటంలేదు. ఆఫ్ఘనిస్తాన్‌లోని జనజీవితాన్ని తాలిబనైజేషన్ చేసినవారు ఎలా ఉక్కపోతకు, ఊపిరిసలపనిస్థితికి గురిచేశారో, భారత దేశంలోనూ అలా చేయబోతున్నారనే ఆరోపణను ఇమిడ్చి ఈ పద ప్రయోగం చేస్తున్నారు.

మనిషికోమాట అనే సామెత వీరికి వర్తించదు. 'మీ ఆరోపణలు అసత్యాలు, విద్యారంగానికి మెరుగులు దిద్దే ప్రయత్నాలే తప్ప, తిమ్మిని బమ్మిగా చేసే మార్పులేవీ జరగటంలేదు' అని ఎవరు చెప్పినా వినరు. విని అర్థం చేసికొని మాట్లాడటం గనుక ఆరంభిస్తే, మాట్లాడడానికి ఏమీ ఉండదు. కాబట్టి వారి ధోరణిని ఏమీ మార్చుకోకుండా వితండవాదం చేస్తునే ఉంటారు. చివరికి సర్వోచ్చ న్యాయస్థానం తీర్పు చెప్పిన తర్వాత కూడా కోడిగ్రుడ్డుకు వెంట్రుకలు పీకే కళను వదలుకోరు.

ఇదంతా ఎంత అసహ్యకరంగా ఉందో, దేశం బాగు కోరుతున్న విద్యావంతులు, ఉపాధ్యాయులు, బాధ్యతాయుత స్థానాలలో ఉన్న మేధావులూ, అధికారులు, అధినేతలూ ఈ విషయాలలోనికి కనీసంగానైనా తొంగిచూడకపోవటం, విషయాన్ని స్వయంగా పరిశీలించుకొని గుణదోషాల విచారణకు యత్నించకపోవటం కూడా అంతగానూ బాధాకరమైన విషయమే.

ముఖ్యమైన పత్రాలను వెబ్‌సైట్‌లో ప్రదర్శించినంత మాత్రాన దేశమంతటికి వెల్లడి అవుతున్న స్థితి ఇంకా ఏర్పడలేదు. ఆంగ్లంలోనో, హిందీలోనో పుస్తకాలు అచ్చువేసి అడిగిన వారందరికీ ఇచ్చినా, జాతీయ భాషలుగా ప్రత్యేక గుర్తింపు పొందిన భాషలను నిత్యవ్యవహారంలో వినియోగించే కోట్లాది ప్రజానీకానికి సందేశం చేరటం లేదు. ఈ భాషలన్నింటిలో పుస్తక ప్రచురణను కేంద్రమే నేరుగా చేపట్టవలసిన అవసరాన్ని గుర్తించవలసిన తరుణ మాసన్నమైంది.

ఈలోగా మనమధ్య తారట్లాడుతున్న సందేహాలను తొలగించుకొనే దిశలో విశాఖపట్నంలో నవంబరు 3న భారతీయ విద్యాకేంద్రం నిర్వహించిన సదస్సులో కీలకోపన్యాసం కేంద్రంగా పాఠశాల స్థాయి విద్యాప్రణాళిక గురించి, అల్పసంఖ్యాక వర్గాలచే విద్యా సంస్థల నిర్వహణ గురించి ఇటీవల సర్వోచ్ఛ న్యాయస్థానం వేఱు వేఱుగా ఇచ్చిన తీర్పుల సారాంశాన్ని ప్రజానీకానికి అందించేందుకు మా ప్రయత్నంగా ఈ చిన్న పుస్తకం వెలువరిస్తున్నాం. వీటితో పాటుగా సమస్య పూర్వాపరాలను విశదీకరించే వ్యాసాలనూ కొన్నింటిని మీ ముందుంచుతున్నాము. వివిధ పత్రికలలో ప్రచురితమైన ఈ వ్యాసాలు భాషా పరంగా సరళంగా ఉన్న కారణంగా సులభ గ్రాహ్యంగా ఉంటాయి. పారిభాషిక పదాలు ఎక్కువైన సందర్భంలో అక్కడక్కడ నారికేళపాకంలోకి వెళ్ళినట్ల నిపించినా, అది కొద్దిభాగమేనని, విషయ ప్రాధాన్యం దృష్ట్యా అది అపరిహార్యమని మీరూ అంగీకరిస్తారని, మా ప్రయత్నాన్ని హర్షిస్తారని మా విశ్వాసం.

- ప్రకాశకులు

---

## విషయానుక్రమణిక

# పాఠశాల స్థాయి విద్యలో పాఠ్యక్రమంలో ప్రతిపాదించిన మార్పులు

## సెక్యులరిజం పేరుతో విద్యారంగప్రగతికి అడ్డుపుల్లలు వేసే ప్రబుద్ధులకు చెంపపెట్టు సుప్రీంకోర్టు తీర్పు

విద్య గురించిన జాతీయ విధానం *(National policy on Education)* 1986లో రాజీవ్‌గాంధీ ప్రధాన మంత్రిగా ఉండగా రూపు దిద్దుకొంది. అందులోని ఒకమాట ఇలా ఉంది "ఈ నూతన విధానంలో సూచించిన విధానాలు, ప్రమాణాలు ఏ విధంగా అమలవుతున్నదీ ప్రతి అయిదేళ్లకూ తప్పక సమీక్షించాలి. అంత కంటే తక్కువ కాలవ్యవధిలో కూడా మధ్యమధ్యన అమలు జరుగుతున్న తీరును, లభించుతున్న ఫలితాలనూ పరిశీలించుకొంటూ ఉండాలి."

1992లో ప్రోగ్రాం అఫ్ యాక్షన్ - కార్యాచరణ పథకం ఒకటి రూపొందించారు. విద్యా విధానాన్ని, పాఠ్యక్రమాలను ఆధునికీకరణం చేయాలని, అందుకై అవసరమైన చర్యలను రాష్ట్రీయ శైక్షిక అనుసంధాన ప్రశిక్షణ పరిషత్ *(NCERT)* ఎనిమిదో పంచవర్షప్రణాళిక ముగిసేలోగా చేపట్టాలని అందులో సూచించారు. తొమ్మిదవ పంచవర్ష ప్రణాళిక రూపకల్పన సమయంలో కూడా పాఠ్యక్రమం నవీనీకరణం జరగక పోవటం పట్ల విచారం వ్యక్తం చేయబడింది. ఇన్ని విధాలుగా ఇన్ని సందర్భాలలో వ్యక్తం చేయబడిన ఆకాంక్షలను, ఆదేశాలనూ దృష్టిలో ఉంచుకొని, పాఠ్యక్రమాన్ని ఎప్పటికప్పుడు నవరించుకొంటూ రావాలని, తద్వారా జాతీయ లక్ష్యాలను విద్యారంగంలో అనుభవాలుగా మలచుకోవాలని గ్రహించుకొని ఎన్.సి.ఇ.ఆర్.టి. 1999 సెప్టెంబరులో నేషనల్ కరికులమ్ ఫ్రేమ్ వర్క్ ఫర్ స్కూల్ ఎజ్యుకేషన్ : ఏ డిస్కషన్

డాక్యుమెంట్ అనే గ్రంథం రూపొందించి, దానిని 2000 జనవరిలో విస్తృతంగా వితరణ చేసింది. వివిధ రాష్ట్రాల విద్యాశాఖలకు, విశ్వవిద్యాలయాలకు, బోధనా కళాశాలలకు, పరిశోధనా కేంద్రాలకు, జాతీయ అంతర్జాతీయ సంస్థలకు ఈ డిస్కషన్ డాక్యుమెంట్ ప్రతులను పంపించారు. అంతేకాదు; అదేమిటో చూస్తాం, ఒక ప్రతిని పంపించండి అని అడిగిన ప్రతివారికీ లేదనకుండా పంపించారు.

దానిని ముందుపెట్టుకొని దేశంలో చాలా చోట్ల చర్చజరిగింది. వివిధ ప్రాంతాలలో కొన్ని సదస్సులను ఎన్.సి.ఇ.ఆర్.టి. స్వయంగా నిర్వహించింది. ఉపాధ్యాయ బృందాలను, స్వచ్ఛంద సేవా సంస్థలను ఈ విషయమై చర్చించడానికి ప్రోత్సహించింది. అలా చర్చించిన చోట్ల నుండి వచ్చిన సలహాలనూ, సూచనలనూ చాలా శ్రద్ధగా పరిశీలించింది.

## పార్లమెంటరీ కమిటీ సిఫారసులు

కేంద్రప్రభుత్వంలోని మానవ వనరుల వికాస విభాగం ఎలా పని చేస్తున్నదో పరిశీలించి సూచనలు చేయటంకోసం పార్లమెంటు ఉభయసభలలోని వివిధ పక్షాల సభ్యులనుండి 44 మందిని ఎంపిక చేసి ఆరేళ్లక్రింద ఒక కమిటీని నియమించారు. కాంగ్రెసు సీనియర్ నాయకుడు శ్రీశంకరరావ్. బి. చవాన్ దానికి అధ్యక్షునిగా నియుక్తుడైనాడు.

ఈ సమితి 1997 జనవరి 16న సమావేశమై ఒక ఉపసమితిని ఏర్పరచింది. 1997 ఆగస్టు 6న ఆ ఉపసమితిలో కొన్ని మార్పులు చేశారు. వారు రెండు సంవత్సరాలపాటు చాలా శ్రమించి విలువలపై ఆధారపడిన విద్య గురించి ఒక విధాన పత్రాన్ని రూపొందించారు. దానిని శంకరరావ్ చవాన్ అధ్యక్షతన ఉన్న పార్లమెంటరీ కమిటీ ఆమోదించి 1999 జనవరిలో పార్లమెంటుకు నివేదించింది.

అందులో వారు చెప్పిన విషయాలు క్లుప్తంగా ఇవి: భారతీయ యువతరం పాశ్చాత్యనాగరికత ప్రభావానికి లోనై దిశావిహీనులుగా భ్రష్టులై పోతున్నారు. "పనికిరాని పరిజ్ఞానాన్ని బట్టీపట్టటం కాక, శీలనిర్మాణానికి ఉపయోగపడే నిజమైన విద్యను నేర్పించాలి"అన్న వివేకానందుని అభిప్రాయాన్ని గమనించాలి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత నియమింపబడిన అన్ని కమిషన్లు - రాధాకృష్ణ కమిషన్ (1948-49), కొఠారీ కమిషన్ (1964-66), ఇంకా ఇతరేతర చిన్న, పెద్ద కమిటీలు కూడా విలువలపై ఆధారపడిన విద్యను నేర్పాలని సూచించినా, అవేవీ ఇంతవరకు క్రియారూపం సంతరించుకోక పోవటం బాధాకరం.

సార్వజనీనమైన విలువలు - సత్యము, సదాచారము (ధర్మము), శాంతి, ప్రేమ, అహింస - ఈ అయిదింటిని ఆధారం చేసికొని రూపొందించే పాఠ్యాంశాలను బోధించి నట్లయితే మానవుని సమగ్రవికాసం - వైజ్ఞానికమైన, శారీరకమైన, సంవేదనాత్మకమైన, మానసికమైన ఆధ్యాత్మికమైన వికాసం సాధ్యమవుతుంది.

*(Truth, righteous conduct, peace, love and non-violence are thecore universal values that can become the foundation for building the value based education programme. These five universal values represent the five domains of the human personality - intellectual, physical, emotinal, psychological and spiritual - are correlated with the five major objectives of education namely knowledge, skill, balance, vision and identity (81st Report on Value Based Education presented to Rajya Sabha on 26th February 1999. Item No. 8)*

వివిధ మతాల, ధార్మిక సంప్రదాయాల గురించి తెలియజేయటం సామాజిక సమైక్యతకు సాంఘిక, ధార్మిక సమన్వయానికి ఉపకరించగలదు. *(Education about religions as an instument of social cohesion and social and religious harmony)*

విద్యార్థులకు భారతదేశ చరిత్ర, స్వాతంత్ర్య సంగ్రామం, సాంస్కృతిక వారసత్వ వైభవం, మన రాజ్యాంగంలో ఉల్లేఖించబడిన పౌరుల విధులు, మన జాతీయతకు గుర్తింపు నిచ్చే అంశాలూ - ఇవన్నీ బోధింపబడాలి

ఈ కమిటీ వారు మరో విషయం కూడా చెప్పారు విలువలపై ఆధారపడిన విద్య అని మరో క్రొత్త విషయాన్ని ప్రవేశపెట్టి విద్యార్థులపై భారం పెంచవద్దు. పాఠశాలలో జరిగే ప్రతి కార్యకలాపంలో (పాఠశాల అసెంబ్లీ లేదా ప్రార్థనాసమావేశం నుండి ఆటలవరకు) బోధించే ప్రతి విషయంలో ఈ జీవన మూల్యాలను అంతస్సూత్రాలుగా పెట్టుకొని విద్యార్థులకు శిక్షణయివ్వాలి. జీవితపు విలువలు నేర్పే ఉపాధ్యాయుడని ఒక ఉపాధ్యాయునికి ముద్రవేసే పద్ధతి గాక, ప్రతి ఉపాధ్యాయుని ద్వారా కూడా విద్యార్థులకు ఈ విలువల గురించిన అవగాహన లభించాలి. మహాపురుషుల జీవితాదర్శములను విద్యార్థుల ముందుంచటం ద్వారా జీవితపు విలువల గురించిన అవగాహన కలిగించాలి.

ఈ విధంగా పార్లమెంటరీ కమిటీనుండి, విద్యావేత్తల సదస్సులనుండి లభించిన సూచనలు, సలహాలు అన్నింటిని ఓపికగా, శ్రద్ధగా పరిశీలించిన ఫలితంగా రూపుదిద్దుకొన్నదే - నేషనల్ కరికులం ఫ్రేమ్ వర్క్ ఫర్ స్కూల్ ఎజుకేషన్. దీనిలో ఏముందో తెలిసికొనడానికై ఆ పత్రం ముందు మాటగా ఎన్.సి.ఇ.ఆర్.టి డైరక్టర్ శ్రీజగ్‌మోహన్ సింగ్ రాజపూత్ వ్రాసిన విషయమే ఇక్కడ ఉటంకించుకొందాం.

## రాజపూత్ గారి మాటలలో

"ఇప్పటి ఈ పాఠ్యక్రమ రూపురేఖలు 1986 నాటి విద్య గురించిన జాతీయ విధానంలోను 1988 నాటి నేషనల్ కరికులం ఫర్ ఎలిమెంటరీ అండ్ సెకండరీ ఎజుకేషన్‌లోనూ, ఎత్తిచూపిన ప్రధానమైన అంశాలను పునరుద్ఘాటిస్తున్నది. 1. భాషా బోధన 2. బోధనాభాష 3. వివిధ స్థాయిలలో ఒకే విధమైన పాఠశాలల అంతర్నిర్మాణం యొక్క ఆవశ్యకత, సాంఘిక సమిష్టి భావనకు సర్వధర్మ సమాదర భావనకు, జాతీయ సమైక్యతకు దోహదంచేసే మౌలిక అంశాలు - యావత్తు విద్యాబోధనా ప్రక్రియలో వాటికి గల ప్రాధాన్యము మొదలైన అంశాలు ఇలా స్వీకరించబడిన వాటిలో ఉన్నవి. వీటి కంటే ముందు రూపొందించబడిన నివేదికలలో సూచింపబడిన మరికొన్ని అంశాలు కూడా తగిన విధంగా విస్తారంగా పొందు పరచబడినవి 1. నిరంతర సమగ్ర మూల్యాంకనము. *(Continuous and Comprehensive Evaluation)* 2. పోతపోసిన తీరునకాక బోధనా పద్ధతులలో అవసరమైన మార్పులు చేసికొనేందుకు స్వేచ్ఛ, 3. వృత్తి విద్యలలో శిక్షణ, భాషలు, గణితము, విజ్ఞానముల గురించిన అవగాహన మొదలైన అంశాలు ఈ విధాన పత్రాలనుండి, నివేదికలనుండి స్వీకరించబడినవి. వివిధ విషయాలలో కనీస 4. వివిధ విషయాలలో కనీసపు అవగాహనాస్థాయిల వైవిధ్యము *(Minimum levels of learning),* 5. విలువల గురించిన శిక్షణ, 6. సమాచార ప్రసార రంగాలలోని సాంకేతిక విజ్ఞానాన్ని వినియోగించుకోవటము, 7.విద్యారంగంలో నిర్వహణ - జవాబుదారీతనముల గురించిన విషయాలు - వీటి గురించిన కొత్త చూపును అందించడానికి కూడా ఈ పత్రంలో ప్రయత్నం జరిగింది.

అనేక సంవత్సరాలుగా పరిశీలిస్తూ వచ్చిన అంశాల ఆధారంగాను, ఈ రంగంలో వృత్తిపరమైన నైపుణ్యంతో చేసిన విశ్లేషణల ఆధారంగానూ మరికొన్నిఅంశాలను పునర్నిర్వచించు కోవటమో, లేక క్రొత్తగా జోడించు కోవటమో జరిగింది. విద్యా విధానం సక్రమంగా ప్రయోజనకరంగా అమలు కావటానికి ఇది అవసరమని భావింపబడింది.

1. ఆరోగ్యప్రదమైన రీతిలో చిన్నపిల్లల కందించవలసిన ప్రేమ, భారంగా కాక ఆనందభరితంగా ఉండే ఆరోగ్యప్రదమైన శిక్షణ.

2. ఉత్కృష్టతను సాధించే సామర్థ్యాన్ని పెంచటమూ - పోషించి నిలబెట్టటము.

3. పాఠ్యక్రమం మరీ బరువెక్కి పోతూ ఉండకుండా తగ్గించుకోవటము

సమకాలీన ప్రపంచంలో వేగంగా సంభవిస్తున్న మార్పులను దృష్టిలో ఉంచుకొని, విద్యగురించిన జాతీయ విధానంలోని మౌలిక తత్వానికి భిన్నంకాని రీతిలో కొన్ని సూచనలు చేస్తున్నది. వాటిలో కొన్ని ఇలా ఉన్నవి.

1. ప్రాథమిక విద్యాస్థాయిలోని మొదటి రెండు సంవత్సరాల కాలంలో పరిసరాల విజ్ఞానాన్ని భాషలతోను, గణితంతోనూ, ఇతర కార్యకలాపాలతోనూ సమ్మిళితం చేసి అందించటం.
2. ప్రాథమిక విద్యాస్థాయిలో కళల అభ్యాసాన్ని, ఆరోగ్యవిద్యను, శారీరిక శిక్షణను, శ్రమ అనుభవాన్ని సమ్మిళితం చేసి "ఆరోగ్యప్రదమైన ఉత్పాదక జీవితం సాగించే కళ" *(Art of Healthy and productive living)* అనే విషయం రూపొందించటం
3. వివిధ మతాల, ధార్మిక సంప్రదాయాల గురించిన పరిచయము, అవగాహన
4. సాంఘిక విజ్ఞానం బోధనలో విషయవస్తు ప్రధానమైన సంకలిత పద్ధతుల ననుసరించుట
5. విజ్ఞాన శాస్త్రాన్ని, సాంకేతిక విజ్ఞానాన్ని సమన్వయపరచి బోధించుట
6. మాధ్యమిక స్థాయిలో గణితాన్ని జీవితానికి దగ్గరగా తీసికొనివచ్చుట.
7. ఇప్పుడు పాఠశాలల్లో ఉన్న విజ్ఞాన శాస్త్ర ప్రయోగ శాలల్లోనే కొంత భాగమును కేటాయించి గణితమును ప్రయోగ పూర్వకముగా అభ్యసించుటకు ఏర్పాటు చేయుట".

## ఈ ప్రతిపాదనలకు తాత్విక భూమిక

ఈ విధమైన సూచనలు, సిఫారసులు చేయడానికి వెనుకగల తాత్విక భూమికను కూడా శ్రీరాజపూత్ ఇలా వివరించారు.

"ఏ దేశపు విద్యా విధానమైనా సరే, తనవైన తాత్వక, సాంస్కృతిక, సాంఘిక సంప్రదాయాలనే బలమైన గడ్డమీద నిర్మింపబడాలి; తన ప్రజల అవసరాలను, ఆకాంక్షలను తీర్చగలిగేదిగా ఉండాలి. అందుకొరకు పాఠ్యక్రమంలో ఈ గడ్డమీద రూపుదిద్దుకొన్న అంశాలకు ప్రాధాన్యముండాలి. భారతదేశంలోని వాస్తవ పరిస్థితులకు అనుగుణమైనదిగా విద్యఉండాలని మరల మరల వక్కాణింపబడుతున్నది. భారతదేశం యొక్క అపారమైన మేధాపరమైన, సాంస్కృతిక సంబంధమైన వారసత్వ సంపద, ప్రపంచ నాగరికత వికాసానికి భారతదేశం యొక్క యోగదానము - అలాగే ఇతరదేశాలు, ఆయాదేశాల సంస్కృతుల యోగదానములు కూడా బాగా స్పష్టంగా తెలియజేయబడాలని ఆశింపబడుతున్నది. వసుధైవ కుటుంబకం (ఎల్లలోకములొక్క ఇల్లయి) అనే భావనను పొదవు కొనిన జాతీయత, దేశభక్తి భావాలు విద్యార్థులలో నింపబడాలి. అవి వారికి రక్తగతం కావాలి. భారతీయులుగా తాము గర్వించ దగిన జాతికి చెందిన వారమనే స్వాభిమానాన్ని అది ప్రోది చేస్తుంది. అదే సమయంలో ఇతర జాతులను పట్ల గౌరవము చూపుతూ, సహనము వహించుతూ ఇతరుల సంస్కృతులను తెరచిన హృదయంతో అవగాహన చేసికొంటూ, స్వీకార్యములైన అంశాలను గ్రహించటంలో గల విలువనూ తెలియజెప్పుతుంది. శాంతి, సుహృద్భావాల సంస్కృతిని

పెంపొందించటంలో అడుగు చిన్నదే అయినా ఒక దృఢమైన ముందడుగు అవుతుంది. ముందుకు సాగిపోవడానికి, జాతీయ ప్రగతి వైభవాల సాధనలో నూతన శిఖరాల అధిరోహణకు మన జాతికి తోడ్పాటు నిస్తుంది. ప్రపంచీకరణం (గ్లోబలైజేషన్) పేరున మనం నడువబోతున్న మిట్టపల్లాల మార్గంలో ఎదురయ్యే సవాళ్లను ధైర్యంగా ఎదుర్కొనడానికి కావలసిన సామర్థ్యాన్ని, ఇచ్ఛాశక్తిని ప్రసాదిస్తుంది.

ఇప్పుడు ప్రతిపాదిస్తున్న ఈ పాఠ్యక్రమ రూపురేఖల పత్రం ఒక సజీవ, ఆచరణాత్మకరూపం సంతరించుకొనడానికి, విద్యారంగంలో విద్యాప్రదాన ప్రక్రియలో పాల్గొంటున్న ఉపాంగాలన్నీ ఏకోన్ముఖమైన నిబద్ధతతో కృషిచేస్తూ సమాజం నుండి సమున్నత స్థాయిలో సహకారం అందిపుచ్చుకోవలసి ఉంది. అలవాటైన గాడిలోనుండి బయట పడలేని ధోరణిలో కూరుకుపోయి పాఠ్యక్రమంలోని అంశాలను ప్రాదేశిక అవసరాలతో సమన్వయం పరచగల శక్తియుక్తులు గల నిపుణులైన వ్యక్తులను సమీకరించటంలో సంస్థలు వెనుకబడినట్లయితే ఎంతో సౌష్టవమైన పాఠ్యక్రమం కూడా పలచబడిపోయి. కనబడకుండా కొట్టుకుపోతుంది. పాఠ్యక్రమ సంబంధమైన విషయాలలో పరిశోధనా ఫలితాలు, శాసన ప్రశాసన కర్తల సంకల్పశక్తి -ఈ రెండూ అందించే మద్దతుతో బలంపుంజుకొన్న యత్నములు ఈ నూతన పాఠ్యక్రమం మాటలలోనే గాక, మాటల వెనుక ఉన్న భావాల రీత్యాకూడా సకాలంలో అమలు చేయబడగలదని విశ్వాసం కలిగిస్తూ మాట ఇస్తున్నవి.

దీనిని పూర్తిగా చదివిన వారు ఎవరూ కూడా దీనిని అభినందించకుండా ఉండలేరు. ఈ పద్ధతిన నడిచే విద్యావిధానంలో ప్రతిబాలుడూ, ప్రతి బాలిక మంచిని చూస్తూ, మంచిని ప్రేమించుతూ, మంచిని అనుసరించేవారుగా, మంచిని ఆచరించేవారుగా పరస్పరం సహన శీలం కలిగిన పౌరులుగా ఎదుగవలెననే లక్ష్యంతో రూపొందించిన ప్రణాళిక ఎంతైనా అభినందనీయమైనది.

మంచి మంచి ఆలోచనలకు కూడా తప్పుడు అర్థాలు తీసేవారుంటారని, వక్రభాష్యాలు చెప్పేవారుంటారని ఈ ఫ్రేమ్‌వర్క్‌కు రూపకల్పనచేసిన వారు గ్రహించక పోలేదు. కాబట్టి ఒక విషయాన్ని ఏ మాత్రం మొహమాటం లేకుండా స్పష్టంగా హెచ్చరించారు.

*However, a word of caution is required here. Education about religions must be handled with extreem care. All steps must be taken in advance to ensure that no personal prejudice or narrow minded perceptions are allowed to distort the real purpose of this venture and no rituals, dogmas and superstitions are propagated in the name of education about religions. All religions therefore have to be treated with equal respect and that there has to be no discrimination on the ground of any religion )*

మరి ఇలా రూపొందించిన పాఠ్యక్రమ విధానానికి వ్యతిరేకంగా వామపక్షాల మేధావులు, వారితో పాటుగా వారి రాజకీయ సహచరులు వ్యాఖ్యానాలు, ఊకదంపుడు ఉపన్యాసాలు, అడ్డుపుల్లలు, సుప్రీంకోర్టులో ప్రజాప్రయోజనాల వ్యాజ్యము ఇన్నిరకాల ప్రయత్నాలు ఎందుకు చేసినట్లు?

## వితండవాదం గొప్ప ఆయుధమని వారి నమ్మకం

సుప్రీంకోర్టుకు గతంలో ప్రధానన్యాయమూర్తిగా పనిచేసిన శ్రీ వి. ఆర్. కృష్ణ అయ్యర్‌ను ఒప్పించి వారు అధ్యక్షులుగా అఖిలభారత శిక్షాబచావో సమితి ఒకటి ఏర్పరిచారు. ఆ సమితి తరపున ప్రధానమంత్రి శ్రీ అటల్ బిహారీ వాజపేయి గారికి బహిరంగ లేఖ ఒకటి శ్రీ కృష్ణఅయ్యర్ స్వయంగా వ్రాసినట్లుగా ప్రాచ్యభాష అనే హిందీ పత్రిక (డిసెంబరు 2000 సంచిక)లో ప్రచురించారు. ఆ లేఖలో ఏవేవో సందేహాలను వ్యక్తం చేశారు.

ఈ విషయం తెలిసిన ఎన్.సి.ఇ.ఆర్.టి డైరక్టర్ శ్రీ జగన్‌మోహన్ సింగ్ రాజపూత్ శ్రీ కృష్ణఅయ్యర్‌ను కలిసి ఆ సందేహాలన్నింటికీ వివరణయిచ్చారు. వారు సావధానంగా విని, ఆ తర్వాత కేంద్రమానవ వనరుల వికాస శాఖా మంత్రి శ్రీ మురళీ మనోహర్ జోషీకి ఒకలేఖ వ్రాశారు. శ్రీ రాజపూత్ ఇచ్చిన వివరణలను అనుమానించ వలసిన అవసరమేమీ లేదని, తాను చేసినట్లుగా వచ్చిన ఆరోపణలనన్నింటినీ ఉపసంహరించుకొంటున్నానని తెలియజేశారు. అయితే వింత ఏమిటంటే ఒక్క హిందూస్తాన్ టైమ్స్ మినహా ఆంగ్ల పత్రికలేవీ ఈ విషయాన్ని ప్రచురించనే లేదు.

ఆ తర్వాత మానవ హక్కుల కమిషన్ అధ్యక్షుడైన జస్టిస్ జె.ఎస్.వర్మ ద్వారా ఆటంకాలు కలిగించే ప్రయత్నమూ, ఢిల్లీ హైకోర్టు ద్వారా ఆటంకాలు కలిగించే ప్రయత్నమూ చేసినప్పటికీ అవి ఫలించలేదు. అయితే అరుణారాయ్, బి.జి.వర్గీస్‌లు దాఖలు చేసిన ప్రజాప్రయోజనాల వ్యాజ్యంతో ఎన్.సి.ఇ.ఆర్.టి. నూతన పాఠ్య గ్రంథాలను విడుదల చేయకుండా సుప్రీంకోర్టునుండి స్టే ఆర్డరు సంపాదించటంలో తాత్కాలికంగా కృత కృత్యులైనారు.

అయితే విషయ మంతటినీ సాకల్యంగా పరిశీలించిన అనంతరం సుప్రీం కోర్టు ఈ అభ్యంతరాలను పూర్తిగా త్రోసిపుచ్చింది. ఈ పాఠ్యక్రమాన్ని అమలు చేయడానికి, ఈ పాఠ్యక్రమం ప్రకారంగా రూపొందించిన పాఠ్యపుస్తకాల ప్రచురణకు, వితరణకు అనుమతి నిచ్చింది. ఒకటి కాకపోతే మరొకటి ఏవేవో పుల్లలు అడ్డువేస్తూ విద్యారంగ ప్రగతి చక్రాలను అడ్డుకొన చూస్తున్న వారికి ఈ తీర్పు నిజంగా చెంపపెట్టు అనటంలో ఏమాత్రం సందేహం లేదు.

# ఎన్.సి.ఇ.ఆర్.టి. నూతన విద్యాప్రణాళిక పై అర్థంలేని ఆరోపణలు!

1986లో విద్య గురించిన జాతీయ విధానం రూపొందించారు. ఈ విధానం అమలు ఎలా ఉందో పరిశీలించే కొలమానాలను ప్రతి అయిదేళ్ల కొకసారి సమీక్షించుకోవాలని అందులో స్పష్టంగా పేర్కొన్నారు. అంతకంటే తక్కువ వ్యవధులలో ఈ ప్రణాళిక అమలులో ప్రగతి ఎలా ఉంది? దీనిలో వెలికివస్తున్న ధోరణులు ఎలాంటివి? అనే విషయాలనూ సమీక్షించు కోవాలన్నారు.

పాఠ్యక్రమవికాసం అనేది ఒకసారి చేసి పడవేసేది కాదని, వేర్వేరు దిక్కుల నుండి వివిధ స్థాయిలలో వివిధ సమయాల్లో వస్తున్న మార్పులను దృష్టిలో పెట్టుకొని స్పందించవలసి ఉందని, జాతీయ లక్ష్యాలను విద్యారంగం అనుభవాలుగా రూపుదిద్దే సాధనం పాఠ్యక్రమమని ఎన్.సి.ఇ.ఆర్.టి. ఒక నిపుణుల సంస్థగా తన బాధ్యతను గుర్తిస్తోందని ముందుమాటలో పేర్కొన్నారు.

తదనుగుణంగా 2000 సంవత్సరం జనవరిలో "నేషనల్ కరికులం ఫ్రేంవర్క్ ఫర్ స్కూల్ ఎడ్యుకేషన్; ఏ డిస్కషన్ డాక్యుమెంట్" అనే ఒక పత్రాన్ని ఇన్.సి.ఇ.ఆర్.టి.లోని అధికారులు, నిపుణులు అనేకమంది సలహాలను స్వీకరించి, చర్చించి రూపొందించి దానిని విస్తృతమైన చర్చకు ప్రతిపాదించారు. దాని ప్రతులను అన్ని విశ్వవిద్యాలయాలకు, రాష్ట్రప్రభుత్వాల విద్యా విషయక విభాగాలకు, పరిశోధనా సంస్థలకు, అంతర్జాతీయ సంస్థలకు, పరిపాలనా రంగంలోని అధికారులకు పంపించారు. అంతేకాదు ఇదేదో చూస్తాం మాకూ పంపండి అని అడిగిన ప్రతివారికీ కాదనకుండా, లేదనకుండా పంపించారు. వెబ్‌సైట్‌లో ప్రదర్శించారు.

దేశమంతటా వివిధరూపాలలో, వివిధ స్థాయిలలో దీని గురించి చర్చ జరిగింది. కొన్నింటిని ఎన్.సి.ఇ.ఆర్.టి యే నిర్వహించింది. మరి కొన్నింటికి ఆర్థికసహాయం చేసింది, ప్రోత్సాహమిచ్చింది. అనేక సంస్థలవారు, కొందరు విద్యావేత్తలు వ్యక్తిగతంగాను, సామూహికంగాను, కొన్ని చోట్ల విద్యార్థుల బృందాలు కూడా చర్చించి తమ అభిప్రాయాలను, అభ్యంతరాలను, ప్రతిపాదనలనూ పంపించారు. వాటినన్నింటినీ క్షుణంగా పరిశీలించి, పరిగణనలోకి తీసికొని రూపొందించినదే నేషనల్ కరికులం ఫ్రేం వర్క్ ఫర్ స్కూల్ ఎడ్యుకేషన్.

బాల్యారంభ దశలో విద్యాబోధన (4,5 సంవత్సరాల వయస్సు వారికి)తో ప్రారంభించి ఉన్నత మాధ్యమిక విద్య వరకు అన్ని విషయాలనూ, అన్ని కోణాలలో దర్శించి స్థూలంగా మార్గదర్శనం అందించే పత్రమిది. "విపక్షాల' వారు వాదిస్తున్నట్లుగా ఇష్టంలేని రాష్ట్రప్రభుత్వాలపై స్వారీ చేస్తున్నది గాని, రుద్దుతున్నది గానీ ఇందులో ఏమీ లేదు.

ఒకటి రెండు తరగతులకు ఇలా ప్రతిపాదించారు.

అ) ఒకే భాష (మాతృభాష గాని, ప్రాంతీయ భాష గాని)

ఆ) గణితం

ఇ) ఆరోగ్యవంతమైన ఉత్పాదక జీవన నైపుణ్యం.

మూడు నుండి 5 తరగతుల వారికి వీటికి తోడుగా పరిసరాల అధ్యయనం జోడింప బడుతుంది. 6 నుండి 8వ తరగతులలో మూడు భాషలు నేర్చుకోవాలి. మాతృభాష లేదా ప్రాంతీయ భాష మొదటిది కాగా, ఒక ఆధునిక భాషను,.ఆంగ్లాన్ని నేర్చుకోవలసి ఉంటుంది. గణితంతో పాటుగా విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలను, సామాజిక శాస్త్రాలను, పనిలో నైపుణ్యం (Work Education) కళల్లో నైపుణ్యం (Art Education fine arts visual and performing) శారీరక, ఆరోగ్య విద్య (ఇందులో ఆటలు, క్రీడలు, యోగాభ్యాసము, ఎన్.సి.సి. స్కౌట్ వంటివి ఉంటాయి) జోడింపబడతాయి. 9,10 తరతుల స్థాయిలోనూ ఈ విషయాలే ఉంటాయి.

వివిధ రాష్ట్రాలలో ఉన్న ప్రభుత్వాల, ప్రజానీకాల అభిప్రాయాలను, ఆకాంక్షలను ఎంతగా పరిగణనలోకి తీసికొన్నదీ త్రిభాషా సూత్ర వివరణలో స్పష్టంగా కనిపించుతుంది.

1. ప్రథమభాష - మాతృభాష గాని, ప్రాంతీయ భాషగాని.

2. ద్వితీయభాష - హిందీ అధికారభాషగా ఉన్న ప్రాంతాలలో - మరొక ఆధునిక భారతీయ భాష లేదా ఆంగ్లం.

హిందీగాక ఇతర భాషలు అధికారభాషగా ఉన్న ప్రాంతాలలో హిందీగాని, ఆంగ్లంగాని.

3) తృతీయభాష - హిందీ అధికార భాషగా ఉన్న ప్రాంతాలలో ఆంగ్లంగాని, ద్వితీయ భాషగా అధ్యయనం చేయబడే భాషగాక మరో ఆధునిక భారతీయ భాషగాని.

హిందీ గాక ఇతర భాషలు అధికార భాషగా ఉన్న ప్రాంతాలలో ఆంగ్లంగాని, ద్వితీయ భాషగా అధ్యయనం చేయబడే భాషగాక మరో ఆధునిక భారతీయ భాషగాని.

జాతీయ సమైక్యత, తమ రాష్ట్రంలోనూ, వివిధ రాష్ట్రాల మధ్య, ఇతర దేశాలతోనూ సులభరీతిలో సంప్రదించుకోగల్గటమూ త్రిభాషా సూత్రం వెనుక ఉన్న మూల ఉద్దేశం. కాబట్టి దీనిని నిజాయితీతో అమలు చేయాలని అన్ని రాష్ట్రాలను, కేంద్ర పాలిత ప్రాంతాలను ఎన్.సి.ఇ.ఆర్.టి. కోరుతోంది. ఈ సూత్రంలోని మౌలిక ఉద్దేశ్యాలకు భంగం కలుగని రీతిలో చిన్నచిన్న మార్పులు చేసికొనవచ్చనీ ఇందులో సూచించారు. కొన్ని ఈశాన్య రాష్ట్రాలలో ఈ విధమైన మార్పులు అవసరం కావచ్చునని, ఆయా రాష్ట్రాల అవసరాల కనుగుణంగా వివేచనతో మార్పులు చేసికోవాలనీ సూచించారు.

పిల్లల మాతృభాష ప్రాంతీయభాష ఒకటేగాని సందర్భాలలో (ఉదా : గోండు, కోయ, లంబాడీ, పట్కారీ వంటి స్థానిక భాషలు మాతృభాషలైన సందర్భాలలో) మొదటి తరగతి నుండి మాతృభాషను గాని, ప్రాంతీయ భాషనుగానీ నేర్పటం ప్రారంభించు మన్నారు.(సాధారణంగా ఈ స్థానిక భాషలనుకూడా ప్రాంతీయభాషలిపిలోనే వ్రాస్తారు.) ఇంటిలో మాట్లాడే భాష, బడిలో నేర్పే భాష వేరువేరుగా ఉన్న సందర్భాలలో ప్రాథమిక స్థాయిలో ఉండగానే సమంజసమైన కాలవ్యవధిలో క్రమంగా ప్రాంతీయ భాషలోనికి వచ్చేటట్లుగా చూడాలని సూచించారు. వివిధ రాష్ట్రాలలో భాషాపరమైన అల్ప సంఖ్యాక వర్గాలవారు తగిన సంఖ్యలో ఉన్నచోట్ల, వారి మాతృభాష నేర్చుకోనడానికి అవసరమైన ఏర్పాటు చేయాలనీ సూచించారు.

రెండవ భాషగా ఆంగ్లాన్నో, హిందీనో నిర్బంధంగా ప్రవేశపెట్టే విషయం ఆయా రాష్ట్ర ప్రభుత్వాల వివేచనతో కూడిన నిర్ణయానికి వదిలివేయాలని కొఠారి కమీషన్ సూచించిన విషయాన్ని పునరుద్ఘాటించారు. కాబట్టి కొన్ని రాష్ట్రాలవారు తమ అవసరాలను దృష్టిలో ఉంచుకొని ప్రాథమికస్థాయిలోనే ఏ మూడో తరగతిలోనో, నాలుగో తరగతిలోనో, అయిదో తరగతిలోనో హిందీగాని, ఆంగ్లాన్ని గాని ప్రవేశపెట్టినా, లేక ప్రాథమిక స్థాయి పూర్తయ్యేవరకు ఒక్క ప్రాంతీయభాష బోధనకు పరిమితమైనా వారిని ఎన్.సి.ఇ.ఆర్.టి. ఏ విధంగానూ ఆక్షేపించదు.

మొదటి రెండు సంవత్సరాలలో శ్రవణ, భాషణ, పఠన, లేఖన ప్రక్రియలలోనూ, ఆలోచించటంలోనూ శిక్షణ యివ్వాలి. వాటిలో శిశువు కౌశలం సంపాదించాలి. ఆయా భాషలకు నిర్దిష్టమైన రీతిలో స్పష్టమైన ఉచ్చారణ చేయటం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలి. మంచి చేతివ్రాత, తప్పులు లేకుండా మాటలు వ్రాయగల్గటం, మౌనపఠనం, చదువుతున్న విషయాన్ని అవగాహన చేసికొనటం మొదలైనవి నేర్పటమే గాక విద్యార్థి తాను చెప్పదలచుకొన్నది స్పష్టంగా, సృజనాత్మకంగా వ్యక్తీకరించే సామర్థ్యం పొందే రీతిలో తీర్చిదిద్దాలి.

మూడవభాషను ఎప్పుడు ప్రారంభించాలో, అది కూడా రాష్ట్రప్రభుత్వాల ఇష్టానికే వదిలివేయాలి. మాధ్యమిక విద్య పూర్తయ్యేవరకు అనగా పదవతరగతి వరకు మూడు భాషల అధ్యయనం కొనసాగాలి.

## సంస్కృతం

సంస్కృతాన్ని గురించి పెడబొబ్బలు వినిపించుతున్న కారణంగా 53, 54 పుటలలో సంస్కృతాన్ని గురించి వ్రాసిన విషయాన్ని మొత్తంగా అనువదించి ఇస్తున్నాను.

"జాతీయ విద్యావ్యవస్థలో సంస్కృతానికి ఒక ప్రత్యేకస్థానం ఉంది. ఎందుకంటే.

వేల సంవత్సరాలుగా ఈ దేశ ప్రజలకు ఈ భాష ఉపయోగపడుతోంది. ఈ దేశపు జనబాహుళ్యపు జీవితాలతో, క్రతువులతో, కర్మ కాండలతో, పర్వదినాలతో నేటికీ ముడివడి ఉంది.

ఆధునిక విజ్ఞానదాయక విషయాల అధ్యయనంలో జోడించుకొనదగిన ఎన్నెన్నో వైజ్ఞానిక అంశములకు ఈ భాష ఒక భాండాగారంగా ఉంది. ఆ ప్రాంతం, ఈ ప్రాంతమని గాక దేశ మంతటా ఈ భాషపట్ల గౌరవము, ఆదరణ ఉన్నవి.

హిందీతోనూ, ఇతర ప్రాంతీయ భాషలతోనూ వ్యాకరణ సంబంధమైన, సమానార్థక పదజాలముల సంబంధమైన, పద వ్యుత్పత్తి - కొత్త పదాలను రూపొందించే ప్రక్రియ సంబంధమైన అనుబంధం ఉన్న కారణంగా, ఆయా భాషలను సులభంగా, బాగా నేర్చుకొనడానికి సంస్కృతం తోడ్పడుతుంది.

శాస్త్రీయమైన పద్ధతిలో రూపొందించిన భాషగా, కంప్యూటర్లలో ఉపయోగించడానికి అత్యంత ఉపయుక్తమైన భాషగా ప్రపంచమంతటా గుర్తింపు పొందిన భాష యిది.

కాబట్టి సంస్కృత అధ్యయనాన్ని ప్రోత్సహించటమూ, అందుకు తగిన ఏర్పాట్లు చేయటమూ ఎంతైనా ఉపయోగకరం, హిందీలోగాని, ప్రాంతీయభాషలోగాని భాగంగా ఒక సంయుక్త అధ్యయన ప్రణాళిక (Composite Course) ద్వారా ప్రాథమికస్థాయిలోగాని, ప్రాథమికోన్నతస్థాయిలో గాని దీనిని ప్రవేశపెట్టవచ్చు.సంస్కృత అధ్యయనం నిర్లక్ష్యానికి గురికాని విధంగా పాఠ్యప్రణాళిక రూపొందించవలసి ఉంటుంది. మాధ్యమిక స్థాయిలో ఏయే భాషలను విషయాలను నేర్చుకోవాలో ఎంచుకునే సందర్భంలో సంస్కృతం చదవదలచినవారికి అవకాశం లేని స్థితి ఉండరాదు. ఏ స్థాయివారైనా సంస్కృత అధ్యయనం ప్రారంభించడానికి వీలుగా సార్వత్రిక విద్యాలయాల ద్వారా కూడా ప్రయత్నం జరగాలి.

సంస్కృత బోధనలో పాఠ్యాంశాలను రూపొందించటంలో ఒక ముఖ్యమైన మార్పు చేయవలసి ఉంది. సంస్కృతాన్ని ఒక సజీవభాషగా, జనసామాన్యపు జీవన అవసరాలకు ఉపయోగపడగల భాషగా గుర్తించి పాఠ్యాంశాలను రూపొందించాలి. ఈనాడు ప్రపంచమంతా యోగాభ్యాసము, వేదగణితము, ఆయుర్వేదము, ఖగోళశాస్త్రముల పట్ల ఎంతో ఆసక్తిని కనబరుస్తూ ఉంది గదా! వాటి అధ్యయానికి సంస్కృతం ఎంతగానో దోహదం చేస్తుంది గదా!"

ఇప్పుడు చెప్పండి! మా మీద హిందీని గాని, ఆంగ్లాన్ని గాని, సంస్కృతాన్ని గాని బలవంతంగా రుద్దుతున్నారని ఆరోపించడానికి గాని, మా మాతృభాషనో, మా ప్రాంతీయభాషనో అణచి వేస్తున్నారని గాని, మా రాష్ట్రప్రభుత్వాల పరిధిలోకి చొరబడి మాకుగల నిర్ణయాధికారాలను హరించి వేస్తున్నారని చెప్పడానికి గాని ఏమన్నా ఆస్కారముందా?

తప్పుడు తడకల అనువాదాలతో, వక్రీకరణలతో పుస్తకాలు, వ్యాసాలు ప్రచురించుతూ వామపక్ష ఉపాధ్యాయసంఘాలు, వారి పత్రికలు కాకిగోల చేస్తూ తమ అజ్ఞానాన్ని ప్రకటించుకొంటున్నాయి. ఆ వ్యాసాలను, పత్రికలను, పుస్తకాలను చదివి కంగారు పడిపోతున్న మేధావులకు ఒక సలహా. ఈ పత్రం ఆంగ్లంలోను, హిందీలోను ముద్రించబడింది. ఎన్.సి.ఇ.ఆర్.టి.ఇ.కి వ్రాసి తెప్పించుకొని మీరు స్వంతంగా చదువుకోండి. కాదంటారా, ఈ విషయమై దుష్ప్రచారానికి స్వస్తి చెప్పండి.

*నడుస్తున్న చరిత్ర - అక్టోబరు 2001*

# దేశంలో సామరస్యవాతావరణం బలపడడానికి వెలుగుబాట సుప్రీంకోర్టు తీర్పు

అరుణారాయ్ తదితరులు వేసిన రిట్ పిటిషన్‌ను విచారించిన గౌరవనీయ న్యాయమూర్తులు శ్రీ ఎం.బి.షా, డి.ఎం. ధర్మాధికారి, హెచ్.కె.సేమాలు సెప్టెంబరు 12న తీర్పు ప్రకటించారు. ప్రధానమైన తీర్పును వ్రాసిన న్యాయమూర్తి శ్రీ ఎం.బి. షా తమ తీర్పు పాఠంలో ప్రకటించిన అంశాలు ఇలా ఉన్నాయి.

సెంట్రల్ అడ్వయిజరీబోర్డ్ ఆఫ్ ఎజుకేషన్ నుండి ఆమోదం లేనందున నేషనల్ కరికులం ఫ్రేమ్ వర్క్ ఫర్ స్కూల్ ఎజుకేషన్ 2000 చెల్లదు; కాబట్టి అమలు చేయతగదు అని పిటీషనర్ల వాదంలోని మొదటి అంశం.

రాజ్యాంగం యొక్కమౌలిక స్వరూపంలో భాగమైన లౌకిక తత్వానికి విరుద్ధంగా ఉన్నందున ఈ పాఠ్యక్రమం రాజ్యాంగ విరుద్ధం., ప్రాథమిక హక్కులలో భాగమైన జీవించే హక్కు *(Right to life - Article 21)* లో భాగములైన విద్యను పొందే ప్రాథమిక హక్కును, వికాసం పొందే ప్రాథమిక హక్కును, సమాచారాన్ని పొందే హక్కును రాజ్యాంగంలోని 27, 28 అధికరణాలను నేషనల్ కరికులం ఫ్రేంవర్క్ ఫర్ స్కూల్ ఎజుకేషన్ ఉల్లఘించుతోందని పిటీషనర్లవాదంలోని రెండవ అంశం.

మొదటి అంశాన్ని గురించిన పరిశీలనలో దృష్టికి వచ్చిన అంశాలు :-

సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఎజుకేషన్‌ని ఏర్పాటు చేయటం పార్లమెంటు ఆమోదించిన చట్టాలననుసరించిగాని, రాజ్యాంగ నియమాలననుసరించిగాని జరిగినది కాదు. 1935 నుండి 1994 వరకు ఈ బోర్డు పనిచేస్తూ ఉన్నప్పటికీ కార్యనిర్వాహక శాఖ ఆదేశాల ఆధారంగానే ఇది ఏర్పాటు చేయబడుతూ వచ్చింది.

ఈ బోర్డు విధులు సమీక్షలు, సలహాలకే పరిమితం. దీని యొక్క ప్రధానమైన ఉద్దేశం కేంద్ర రాష్ట్రప్రభుత్వాల మధ్య విద్యారంగంలో సమన్వయం సాధించటం

ఈ బోర్డులో 104 మంది సభ్యులు ఉండేవారు. 64 మంది ఎక్స్‌అఫిషియో సభ్యులు. 32 మంది ప్రభుత్వం చేత నామాంకితం చేయబడిన సభ్యులు. 8 మంది పార్లమెంటు చేత ఎన్నుకోబడిన సభ్యులు. సమావేశానికి కోరం 2/3 సభ్యులు. బోర్డు ఏటేటా సమావేశమవుతూ ఉండాలని, రెండు సమావేశాల మధ్య కాలం ఎట్టి పరిస్థితిలోనూ రెండేళ్లు దాటరాదని 1986లో విద్యాశాఖ ఆమోదించిన తీర్మానం తెలియ జేస్తోంది.

అయితే 1994 తర్వాత ఈ బోర్డు యొక్క పునర్వ్యవస్థీకరణం జరుగలేదు. 1997లో భారతప్రభుత్వం డిప్యూటీ సెక్రటరీ ద్వారా ఈ బోర్డును పునర్వ్యవస్థీకరించే సంబంధమై వ్రాసిన లేఖను మా దృష్టికి తెచ్చారు. చాలామంది సభ్యులతో కూడిన ఈ బోర్డు తన కప్పగించబడిన విషయాలను చర్చించి నిర్ణయాలు తీసికొనడానికి అనువుగా లేదని, తక్కువ మంది సభ్యులతో కూడిన బోర్డును ఏర్పరచు కోవటం మంచిదా అన్న విషయం విద్యాశాఖ పరిశీలించాలని నాటి ప్రధాన మంత్రి అభిప్రాయపడినట్లుగా ఆ లేఖలో ఉంది.

1990-92 సంవత్సరాలలో మానవ వనరుల అభివృద్ధి శాఖ నివేదికలో ఒక విషయం ప్రస్తావించారు. విద్యారంగంలో వివిధ భాగాలను అభివృద్ధి చేయటంలో ప్రత్యేక కృషి చేస్తున్న కొన్ని జాతీయస్థాయి సంస్థలున్నవని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు విధానాలను కార్యక్రమాలను రూపొందించుకోవటంలో ఈ సంస్థలు సలహాలను, సహకారాన్ని ఇవ్వగలవని పేర్కొంటూ నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఎజుకేషనల్ ప్లానింగ్ అండ్ అడ్మినిస్ట్రేషన్ *(National Institute of Educational Planning and Administration)* ను రాష్ట్రీయ శైక్షిక అనుసంధాన ప్రశిక్షణ పరిషత్ *(NCERT)* ను ఉదహరించారు. దీనిని బట్టి సెంట్రల్ అడ్వయిజరీ బోర్డు ఆఫ్ ఎజుకేషన్ కేవలం సలహామాత్రమే యివ్వగల సంస్థకాగా, *NCERT* వంటి సంస్థలు విధానాల, కార్యప్రణాళికల రూపకల్పనలో ప్రభుత్వానికి సహకరించవలసిన బాధ్యతగల సంస్థలని ఆ నివేదిక స్పష్టపరుస్తున్నది.

అసలు 1994 నుండి *CABE* మనుగడయే లేదని, తప్పనిసరిగా *CABE* అభిప్రాయాన్ని ఆమోదాన్ని పొందవలసిందేనని చట్టబద్ధమైన నిబంధన ఏదీ లేదని ప్రతివాదులు వాదించారు.

ఎన్.సి.ఇ.ఆర్.టి. మెమొరాండం ఆఫ్ అసోసియేషన్ పరిశీలించగా, పాఠ్యక్రమం నమూనాలను రూపొందించటమూ, పాఠ్యపుస్తకాలను, ఇతర సాహిత్యాన్ని రూపొందింప జేయటమూ, విద్యారంగంలో అనుసరించవలసిన పద్ధతులకు మెరుగులు దిద్దటమూ *NCERT* కి ప్రత్యేకంగా అప్పగించిన బాధ్యతలని స్పష్టపడుతుంది. ఇది ఒక ఉన్నతాధికార సంస్థయని దాని నియమావళి తేటతెల్లం చేస్తోంది.

***(It is clear from a reading of the Memorandum of Association of NCERT that preparation of a curriculam model, which could be followed generally to improve educational techniques and practices and which could also form the basis of preparation and or publication of books and other materials, is one of roles specifically assigned to the NCERT. The constitution of the council under the Rules, shows that it is a high powered body.***

ఇన్ని విషయాలను పరిశీలించిన తర్వాత ఈ అంశమై సారాంశంగా వారు తేల్చి చెప్పినది.

"సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్‌ను సంప్రదించకపోవటం నేషనల్ కరికులం ఫ్రేం వర్క్ ఫర్ స్కూల్ ఎడ్యుకేషన్‌ను ప్రక్కన పడవేయడానికి తగి[illegible] కారణం కాదని మేము అంతిమంగా తేల్చిచెప్తున్నాం. ఎందుకంటే

అ) సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్ రాజ్యాంగ సూత్రాల ప్రకారంగా ఏర్పడిన సంస్థ కాదు.

ఆ) 1986లో, 1990లో సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఏడ్యుకేషన్‌ను వ్యవస్థీకరించే సందర్భంలో చేసిన తీర్మానాలలో నేషనల్ కరికులం ఫ్రేం వర్క్ ఫర్ స్కూల్ ఎడ్యుకేషన్‌ను రూపొందించే సందర్భాలలో ఈ సంస్థను సంప్రదించి తీరాలని పేర్కొనబడలేదు. సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్ కార్యకలాపాలు ప్రధానంగా విద్య గురించిన జాతీయ విధానాన్ని అమలు చేయటంలో సలహా పూర్వకమైనవి, కేంద్రం - రాష్ట్రాల మధ్య సమన్వయానికి సంబంధించినది మాత్రమే.

ఇ) 1994 తర్వాత ఈ బోర్డును పునర్వ్యవస్థీకరించటం జరుగలేదు, అయినా తమ తమ అధికార హోదాలననుసరించి కొందరు సహజంగా దీనిలో సభ్యులుగా ఉన్నారని, దీని అస్తిత్వం సమసిపోలేదని అనుకొంటే అనుకోవచ్చు. ఈ బోర్డును ఎందుకు పునర్వ్యవస్థీకరించలేదు అనే విషయం తేల్చటం ప్రస్తుతం మా పరిశీలనలో లేదు. దీనిని పునర్వస్థీకరించాలా, లేదా, పునర్వ్యవస్థీకరించేటట్లయితే ఇంతమంది సభ్యులు ఉండేటట్లుగానా లేక 1997 ఫిబ్రవరి 12 నాటి లేఖలో ప్రధానమంత్రి అభిప్రాయపడిన విధంగా తక్కువమంది సభ్యులతో ఏర్పడటమే మంచిదా అనే విషయాన్ని ప్రభుత్వమో లేక పార్లమెంటో తేల్చవలసి ఉంటుంది.

ఈ) రాష్ట్రీయ శైక్షిక అనుసంధాన ప్రశిక్షణా పరిషత్ (NCERT) నిబంధనల ననుసరించి ఏర్పడిన సంస్థ, దీనిలో కూడా (వివిధ రాష్ట్రాలలో) అధికార హోదాల ననుసరించి సభ్యులైన వారు, పార్లమెంటు ప్రతినిధులు, విద్యారంగ విశేషజ్ఞులు సభ్యులుగా ఉన్నారు."

*In the result, we hold that non-consultation with CABE can not be held to be a ground for setting aside the National Curriculam Frame work for School Education (NCFSE) as*

*a) CABE is not a statutory body;*

*b) There is nothing in the resolution passed by the Government constituting the CABE in 1986 and 1990 that CABE is required to be consulted before framing NCFSE. Functions of the CABE are mainly to advise the Government and co-ordinate between the centre and state in implementing the National Education Policy*

*c) For one or other reason, it is not reconstituted after 1994, may be that ex-officio members at present constitute CABE. However, we are not required to decide why the CABE is not reconstituted. It is for the Government or for the Parliament to decide the said question and to reconstitute the same as it is or by making it a compact Board as suggested by the Prime Minister which is evident from the letter dated 12 February 1997 written by the Deputy Secretary, GOI, for reconstitution of CABE,*

*d) NCERT is constituted under the Rules. It also consists of ex-officio members as well as representatives of Parliament and experts in the education.*

ఈ తీర్పుకు అనుబంధంగా న్యాయమూర్తి హెచ్.కె.సేమా మరి కొన్ని విషయాలను ప్రస్తావించారు ఒక మేరకు విభేదించారు కూడా.

"నా దృష్టిలో, నియామక సదస్యులతో రిక్తస్థానాలను భర్తీ చేయలేదనే నెపంతో సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్ వంటి ప్రాధాన్యంగల సలహాసమితిని ప్రక్కనపెట్టటం ఉచితం కాదు.. ఈ బోర్డును కొనసాగింటమో లేక రద్దుచేయటమో నిర్ణయించే విచక్షణాధికారం ప్రభుత్వానికి ఉన్న మాట నిజమే. అయితే ఆ బోర్డు రద్దు పరచబడకుండా ఉన్నంతవరకు - 1935 నుండి వస్తూ ఉన్న సంస్థ కాబట్టి - దానిని సంప్రదించే సంప్రదాయాన్ని తప్పించరాదు. కాబట్టి భారత ప్రభుత్వం నియామక సదస్యుల రిక్త స్థానాలను భర్తీ చేయాలని, సమావేశం ఏర్పరచి నేషనల్ కరికులం ఫ్రేం వర్క్ స్కూల్ ఎడ్యుకేషన్ గురించిన అభిప్రాయం తెలిసికోవాలని - ఈ పని వీలయినంత త్వరగా, రాబోయే విద్యా సంవత్సరానికి ముందే పూర్తి చేయాలని సూచిస్తున్నాను. అయితే సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్‌ను సంప్రదించని కారణంగా ఎన్.సి.ఇ.ఆర్.టి. ప్రచురించిన నేషనల్ కరికులం ఫ్రేం వర్క్ ఫర్ స్కూల్ ఎడ్యుకేషన్ 2000 చట్ట విరుద్ధం కాబోదు. సి.ఎ.బి.ఈ. గురించిన ఈ అభిప్రాయాన్ని ప్రకటిస్తూ, సోదర న్యాయమూర్తి షా వ్యక్తీకరించిన ఇతర అభిప్రాయలన్నింటితో నేను ఏకీభవిస్తున్నాను".

*In my view, side stepping such an important Advisory Board as CABE on the plea of non-reconstitution of nominated memebers is not proper.... it is true, whether to continue or to discontinue such Board is within the realm of the executive authority, but as long as it exists, consultation with such body, which has been in existance since 1935, can not be side - tracked. The union of India is, therefore, directed to consider the filling up of the vacancies of the nominated members of CABE and convene a meeting of CABE for seeking its opinion on NCFSE as expeditiously as possible and in any case before the next academic session. This would not, however mean that NCFSE 2000 published by NCERT is illegal for non-consultation of CABE*

*With this view on CABE, I concur with the view taken by Brother Shah, J in all other respects.*

**ఇక రెండవ అంశం. ఈ పాఠ్యక్రమం లౌకిక తత్వానికి విరుద్ధంగా ఉందనే అంశం గురించి. న్యాయమూర్తి ఎం.బి.షా ముగింపు వాక్యాలు ఇలా ఉన్నవి.**

"28వ అధికరణం నిషేధించిన మతపరమైన శిక్షణ గురించి నేషనల్ కరికులం ఫ్రేం వర్క్ ఫర్ స్కూల్ ఎడ్యుకేషన్ ఎక్కడా ప్రస్తావించలేదు. ఇప్పుడు ప్రవేశపెట్ట దలచినది జీవన మూల్యాలను గురించి విద్య. మతం ప్రస్తావన ఏ మేరకు అంటే - అన్ని మతాలలోని మౌలిక సారాంశం ఒక్కటేనని, అనుసరించే తీరులు మాత్రమే భిన్నంగా ఉంటాయని విద్యార్థులకు తెలియజెప్పాలని ప్రతిపాదించారు. ఒక విషయం గురించి విస్పష్టంగా హెచ్చరిస్తున్నారు - వ్యక్తిగతమైన ఇష్టాయిష్టాలను గాని, సంకుచిత - భావనలను గాని ముందుకు రానిచ్చి అసలు ఉద్దేశానికి హాని జరుగకుండా ముందునుండే జాగ్రత్త వహించుతూ, అవసరమైన చర్యలన్నీ తీసికోవాలి. మతాలను గురించిన విద్య అనే పేరుతో మూఢాచారాలను గాని, అంధ విశ్వాసాలను గాని ప్రచారం చేయరాదు. ఇప్పుడు ప్రవేశపెట్టదలచిన ఈ విషయం 51 A (e) అధికరణంగా రాజ్యాంగంలో పొందుపరచబడిన అంశమే. "మతాలకు, భాషలకు, ప్రాంతాలకు, వర్గాలకు వాటి మధ్య వైవిధ్యాలకు అతీతంగా భారత ప్రజానీకమందరిలో ఉమ్మడి సహోదర భావాన్ని, సామరస్యాన్ని పెంపొందించాలి. స్త్రీలను కించపరిచే ఆచారాలను, పద్ధతులను విడనాడాలి". విశ్వజనీన మూల్యములైన సత్యము, సదాచారము(ధర్మము) శాంతి, ప్రేమ, అహింసలు విద్యకు పునాదిరాళ్లు కావాలి".

***The NCFSE nowhere talks of imparting religious instruction as prohibited under Article 28. What is sought is to have Value based educatio. and for religion it is stated that students be given the awareness that the essence of Every religion is common; only practices differ. There is a specific caution that all steps should be taken in advance to ensure that no personal prejudices or narrow minded perceptions are alowed to distort the real purpose. Dogmas and superstition should not be propagated in the name of education about religions. What is sought to be imparted is incorporated in Article 51 A (e) which provides "to promote harmony and the spirit of common brotherhood amongst all the people of India transcending religious, linguis-***

*tic and regional or sectional diversities; to renounce practices derogatory to the dignity of women". And to see that universal values such as truth, righteous conduct, peace, love and non -violece be the foundation of education.*

*In the end, the petition is dismissed with no order as to the costs. Interm relief granted by this court stands vacated. I As (Interim Appeals?) seeking intervention in this matter stand disposed of accordingly.*

కాగా *Education of religions* అన్న అంశం రాజ్యాంగం మౌలిక స్వరూపంలో భాగమైన సెక్యులరిజానికి విరుద్ధంగా ఉందనే వాదన గురించి న్యాయమూర్తి డి.ఎం. ధర్మాధికారి చాలా విపులంగా చర్చించారు.

"ప్రభుత్వ నిధులతో నడిచే విద్యాసంస్థలలో కూడా మతాలను గురించిన పరిజ్ఞానాన్ని అందించవచ్చుననే అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. అయితే ఇది అల్పసంఖ్యాక వర్గాలు నెలకొల్పి నిర్వహిస్తున్న విద్యాసంస్థలలోనో, లేక 28 (2) అధికరణంలో ప్రస్తావించబడిన ధర్మాదాయ సంస్థలచే నెలకొల్పబడి నిర్వహింపబడుతున్న సంస్థలలోనో బోధిస్తున్న మతసంబంధమైన విద్యతీరులో ఉండకుండా, దానికి భిన్నమైన తీరులో ఉండాలి.

పాశ్చాత్య ప్రపంచంలో, ప్రత్యేకించి బ్రిటన్‌లో మతపరమైన విద్య అంటే మతాచారాలను నేర్పించటంగానే అర్థంచేసికోబడుతోంది. (దీని నుండి పిల్లల బుర్రలను బాగా రుద్ది వారికి మతోన్మాదాన్ని బాగా ఎక్కించేడానికేగాక స్వేచ్ఛగా ఆలోచించుతూ, అన్వేషణా దృష్టిని కలిగి ఉండడానికి అడ్డు చెప్పేందుకు కూడా అవకాశమేర్పడుతుంది) రాజ్యాంగంలో లౌకిక విధానాన్ని ఆమోదించిన భారతదేశంలో మత సంబంధమైన విద్య మతాచారాలను నేర్పే విద్యకు భిన్నమైనదని, ప్రపంచంలోని అనేక మతాలను అవగాహన చేసుకొనే దృష్టితో పరిశీలించాలని గ్రహించుకొని ఈ ధోరణిని పిల్లలకూ అలవరిచే ప్రయత్నం జరగాలి"

*I am in agreement with the view that education of religions can be imparted even in educational institutions fully maintained out of State funds. But (this) has to be education of a nature different from religious education or religious instructions which can be imparted in educational institututions maintained by minorities or those established under any endoment or trust as referred in clause (2) of article 28.*

*In western world particularly in Britain religious education has been understood as mearly identical with the religious instruction (There is a possibility of indoctrination or brain washing of the children and thus curbing their inquisitiveness and free thinking in the name of religion) India which is wedded to a secular philosophy by its constitution; religious education to distinguish it from religious instruction can mean approaching the many religions of the world with an attitude of understading and trying to convey that attitude to children.*

ఆ తర్వాత ప్రముఖ తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి రచించిన *Education and Significance of life* గ్రంథం నుండి విస్తృతంగా ఉటంకించి, ఆపైన గాంధీజీ సహచరుడైన వినోబాభావే తన అనుభవాలు, అధ్యయనం ఆధారంగా అన్ని మతాల, ధార్మిక సంప్రదాయాలనుండి అందరూ హర్షించగల నీతి సూత్రాలను కూర్చడానికి చేసిన ప్రయాసలను ఉదహరించుతూ న్యాయమూర్తి చివరికి ఇలా చెప్పారు.

"భారతదేశంలోకి శరణార్థులుగా వచ్చినా, దురాక్రమణకారులుగా వచ్చినా, ఎవరు ఎలా వచ్చినా, వారి మతాలలోని మంచిని గ్రహించి అలవరచుకొనడానికే భారతదేశం యత్నించింది. వివిధ మతాల ఆలోచనలను సమన్వయించుకొని జీర్ణంచేసికొంటే తత్వము, సామర్థ్యమూ హిందువులలో ఉన్న కారణంగానే ఇది సాధ్యమైంది. వైవిధ్యభరితమైన ప్రజానీకంతో నిండిన భారత సమాజం తన ప్రభుత్వ వ్యవహారాలను నడిపించుకొనడానికి లౌకిక తత్వాన్ని ఆధారం చేసికొంది. కాబట్టి అటువంటి భారత సమాజంలో మతాల మధ్య వైవిధ్యాన్ని వివరించే విద్య చదువులో అంతర్భాగం కావటం సముచితమే. నేనూ - నా మతమూ అంటూ గిరిగీసికొని వ్యవహరించే ధోరణికి భిన్నంగా అందరినీ కలుపుకొనిపోయే తత్వాన్ని నేర్పాలి. మతాల మధ్య ఉన్నది వైవిధ్యమే గాని, వైరుధ్యం కాదు అనే స్పష్టీకరణనూ విద్యార్థులచే గ్రహింపజేయాలి..... (ఆంగ్లంలో మరింత విపులంగా ఉటంకించిన భాగాలు చదవండి).

వివిధ మతాల గురించి తెలిసికొనటం ఈ దేశలలో ప్రతి పిల్లవానికి ఉన్న హక్కు. రాజ్యాంగంలోని 28 (1) అధికరణం మతాల గురించి బోధించటం అనుమతించటం లేదని వ్యాఖ్యానించటం పిల్లలకు గల ప్రాథమిక హక్కును హరించటమే. కాబట్టి పాఠశాలల్లో వివిధ మతాల గురించి బోధించాలని ఇప్పుడు నిర్ణయించటం లౌకిక తత్వానికి లేదా సర్వధర్మ సమాదరభావనకు విరుద్ధమైనది కానేకాదు".

***Whatever kind of people came to India either for shelter or as aggressors, India has tried to accept the best part of their religions... This happened in India because of capacity of Indians to assimilate thoughts of different religions... In a pluralistic society like India which accepts secularism as the basic ideology to govern its secular activities, education can include study based on the religious pluralism. Religious pluralism is opposed to exclusivism and encourages inclusivism.***

***Exclusivism in religion has been explained to mean - the view that one particular tradition alone teaches the truth and constitutes the way to salvation or liberation. The Christians believe in the words attributed to Jesus in the Gospel of John "No one can come to the Father, but by me" They also believe as early as the third century dogma of extra ecclesiam nulla salus ("outside the church, no salvation")***

***Muslims similarly believe that there is only one God and his one Messenger, the Prophet.***

*Jews cherish their ethnically exclusive identity as God's chosen people. Hindus revere Vedas as eternal and absolute and Buddhists have often seen Goutama's teachings as the Dharma that alone can liberate human beings from illusion and misery...*

*The comprehensive approach to religion which should be inculcated in a society comprising people of different religions and faiths is deseribed as inclusivism... Education in India which is to be governed by secular ethos contained in its constitution and where religious instructions in institutions of the state are forbidden by article 28 (1), The religious education which can be permitted, would be education based on religious pluralism. The experiment is delicate and difficult but if undertaken sincerely and in good faith for creating peace and harmony in the society, is not to be thwarted on the ground that it is against the concept of secularism as narrowly understood to mean neutrality of state towards all religions and bereft of positive approach towards all religions.*

*Any interpretation of Article 28 (1) which negates the fundamental right of a child or a person to get education of different religions of the country and outside the country and his own religion would be destructive of his fundamental right of receiving information, deriving knowledge and conducting his life on the basis of philosophy of his liking.*

*Indian Society is composed of people of various religions and faiths. They are expected not only to live together and tolerate each other, but to live a harmonious life in peace and love. Before and after partition in India religious conflicts and communal disturbances have impeded the growth of this nation and its attempts towards progress. After National Educational Policy of 1986, a shift by the imprugned National Educational Policy 2002 towards teaching of religions in the schools to educate children to understand common factors in all religions, is not a non-secular step.*

పాఠశాలల్లో మతాల, ధార్మిక సంప్రదాయాల గురించిన విద్యను అనుమతించాలా వద్దా అనే విషయమై చర్చించటమేగాక, అలా అనుమతించే సందర్భంలో అందులో ఏమేమి ఉండాలి, ఏ పద్ధతిలో ఉండాలి, ఏ లక్ష్యంతో, ఏ ఉద్దేశంతో వాటిని బోధించాలి అనే అంశాలను కూడా న్యాయమూర్తి ధర్మాధికారి విపులంగా చర్చించారు. స్థలాభావము, సమయాభావముల కారణంగా వాటి నన్నింటిని ఇక్కడ ఉటంకించటంలేదు. ఈ తీర్పులో వారు పేర్కొన్న అంశాలు ప్రాతిపదికగా విద్యారంగంలో చర్చ జరగాలని, తద్వారా మైనారిటీ వర్గాలు నిర్వహిస్తున్న పాఠశాలల్లో కూడా *Exclusivism* స్థానంలో *Religious Pluralism* భావనలు ప్రవేశపెట్టబడాలని, దేశమంతటా విశాలభావనలు నిండి సాంఘికంగా సామరస్యపూర్వకమైన వాతావరణం నెలకొనేవిధంగా విద్యా రంగంలో మార్పులు చోటు చేసికొనడానికి ఈ తీర్పు ఒక వెలుగుబాట కాగలదని మనం ఆశించవచ్చు.

# మైనారిటీ విద్యా సంస్థలపై సుప్రీంకోర్టు తీర్పు - పర్యవసానాలు

అక్టోబరు 31 న మైనారిటీ విద్యాసంస్థల గురించి 11 మంది న్యాయమూర్తులతో కూడిన సర్వోచ్చన్యాయస్థాన ధర్మాసనం ఇచ్చిన తీర్పు మన రాజ్యాంగాన్ని మన పాలకులు, అధికారగణమూ అర్థం చేసి కొంటున్న తీరులోగల అనేక లోపాలను సవరించే ప్రయత్నం చేసింది.

ఇతరులెవరికీ లేని కొన్ని ప్రత్యేక హక్కులు మతపరమైన అల్పసంఖ్యాక వర్గాలకు కల్పిస్తూ మన రాజ్యాంగంలో ఏవో కొన్ని అధికరణాలు పొందు పరచబడినవనే భ్రమలను ఈ తీర్పు పటాపంచలు చేసింది. ఈ దేశ ప్రజానీకానికి ఉన్న ఏ హక్కు, ఏ అవకాశమూ మతపరమైన అల్పసంఖ్యాక వర్గాలకు గాని, భాషా పరమైన అల్పసంఖ్యాక వర్గాలకు గాని నిరాకరింపబడటం లేదనీ ఈ తీర్పు స్పష్టం చేసింది. విద్యాసౌకర్యాల కల్పన, విద్యా సంస్థల నిర్వహణ రాష్ట్రప్రభుత్వాల పరిధిలోని విషయం కాబట్టి అల్పసంఖ్యాక వర్గాల గురించిన ప్రస్తావనలో మతపరమైన అల్పసంఖ్యాక వర్గాల సమస్యలనే గాక, భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాల సమస్యలను కూడా న్యాయస్థానం సమాన స్థాయిలో పరిగణించింది. కాబట్టి విద్యారంగానికి సంబంధించిన సందర్భాలలో అల్పసంఖ్యాక వర్గాలు ఎవరు అనే విషయం రాష్ట్రాల స్థాయిలోనే నిర్ధారించవలసి ఉంటుందని స్పష్టీకరించింది.

విద్యాబోధనను ఒక వృత్తిగా చేపట్టే హక్కు అందరికీ ఉందని, కాబట్టి విద్యా సంస్థలను ఏర్పాటు చేసికొని ఉత్తమస్థాయిలో విద్యాబోధన చేయడానికి ఒక వ్యక్తి లేదా ఒక సముదాయం యొక్క కులం గాని, మతం గాని, భాష గాని ప్రతిబంధకాలు కాజాలవని కూడా సర్వోచ్చన్యాయస్థానం ప్రకటించింది. ఇలా నడిపే విద్యాలయాలు

వ్యాపార దృష్టితోనో, లాభార్జన దృష్టితోనో నడిపేవిగా ఉండరాదని హెచ్చరించింది. అయితే రాబోయే కాలానికి అవసరమయ్యే భవనాలు, ఉపకరణాలు సమకూర్చుకొనే దృష్టితో కొద్దిపాటి లాభాన్ని లేదా మిగులును కలిగి ఉండటం తప్పుకాదనీ చెప్పింది.

ఉద్యోగాలిచ్చే విషయంలోనూ, విద్యార్థులకు ప్రవేశం కల్పించే విషయంలోనూ అల్పసంఖ్యాక విద్యాసంస్థలు రాష్ట్రప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాలు రూపొందించిన నిబంధనలను దృష్టిలో ఉంచుకొని స్వతంత్రంగా వ్యవహరించ వచ్చునని చెప్పింది. అయితే అది సర్వంసహా స్వాతంత్ర్యం కాదు. కొన్ని విధివిధానాలను రూపొందించుకొని, వాటిని పారదర్శకంగా అమలు చేయవలసి ఉంటుంది.

ప్రభుత్వం నుండి ఆర్థికసహాయం పొందే విద్యాసంస్థలు ప్రభుత్వం రూపొందించే నిర్దేశాలను ముఖ్యంగా అనుసూచిత కులాలకు, అనుసూచిత జనజాతులకు ఆరక్షణలు వర్తింపజేయటం వంటి విషయాలలో తప్పక పాటించవలసి ఉంటుంది.

## భాషాపరమైన అల్పసంఖ్యాకులపై పెనుభారం

వివిధ రాష్ట్రాలలో ఉన్న భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాలపై ఈ తీర్పు అలా పెద్ద భారం పెట్టింది. భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాల పిల్లల చదువులకోసమని, వారి మాతృభాషను బోధనాభాషగా కాకపోయినా, ఒక భాషగానైనా నేర్చుకొనడానికి అరకొరగానైనా ఏర్పాటు చేస్తున్న రాష్ట్రప్రభుత్వాలు ఇకముందు ఆ బాధ్యత తమది కాదని తప్పుకోవచ్చు. రాజకీయంగా శాసించగల సత్తా ఉన్న భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాలు ప్రభుత్వం ద్వారానే తమకొరకు బోధనా సదుపాయాలు ఏర్పరచుకొన్నా, అవి ఎక్కడో ఒకటి రెండు చోట్లకే పరిమితమ్ అవుతాయి. చాలాచోట్ల భాషాపరమైన అల్పసంఖ్యాకవర్గాలు తమభాషను, సాహిత్య సంస్కృతులను నిలుపుకోవటం కోసం తామే ప్రత్యామ్నాయవ్యవస్థ చేసికోవలసి రాగలదు.

ఎక్కడికక్కడ స్థానికులే ఈ ఏర్పాటు చేసికొనగలరా, లేక ఆ భాష మాట్లాడేవారు ఎక్కడ ప్రభుత్వంలో ఉన్నారో, అక్కడి నుండి సుశిక్షితులైన ఉపాధ్యాయులను, విరాళాలను పంపించవలసి వస్తుందా అన్న విషయం పరిశీలించుకోవలసి వస్తుంది. స్పష్టంగా అర్థమయ్యేట్లుగా చెప్పుకొనడానికి ఉదాహరణగా చెప్పుకొందాం. తమిళనాడులోని ధర్మపురి జిల్లాలోను, చెన్నై నగరంలోను, సేలం, కోయంబత్తూరు నగరాలలోనూ, అలాగే కర్ణాటకలోని కోలారు, బళ్లారి జిల్లాలలోనూ, ఒరిస్సాలోని గంజాం, గజపతి, కోరాపుట్ జిల్లాలలోనూ, పశ్చిమబెంగాల్‌లోని ఖర్గపూర్, కొలకత్తా నగరాలలోనూ, ఢిల్లీలోనూ తెలుగు మాధ్యమం పాఠశాలలు నిర్వహించటమో లేకుంటే తెలుగు భాషా అధ్యయన కేంద్రాలను, తరగతులను నిర్వహించటమో తెలుగువారి

బాధ్యత అవుతుంది. స్థానికంగా ఉన్న తెలుగువారి వద్ద అందుకు అవసరమైన స్థాయిలో వనరులు లేని సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమో, ప్రజానీకమో అవసరమైన సహాయం చేయవలసి వస్తుంది. ఇలాగే వేఱువేఱు రాష్ట్రాలలో వ్యాపించి ఉన్న తమ తమ భాషీయులు గుర్తింపును నిలుపుకొనడానికి ,వివిధ భాషల ప్రజానీకం ప్రత్యేక ప్రయత్నం చేయవలసి ఉంటుంది.

## ఇకముందు మతం మార్చుకోవలసిన అగత్యం ఉండదు.

సుమారు ఆరుమాసాల క్రిందట కె.బాలసుబ్రహ్మణ్యం అనే ఒక పాత్రికేయుడు ఆంధ్రప్రదేశ్‌లో మైనారిటీ విద్యాసంస్థల తీరుతెన్నుల గురించి తన అధ్యయన ఫలితాలను ఒక ఆంగ్ల పత్రికలో వ్రాశాడు. మైనారిటీలమనే పేరుతో విద్యాసంస్థలు ప్రారంభించినట్లయితే తమపై ప్రభుత్వం అజమాయిషీ ఉండదు అనే ఉద్దేశ్యంతో లాభార్జన దృష్టి గల అగ్రవర్ణాలవారు కొందరు బినామీగా విద్యాసంస్థలు ప్రారంభించటం జరుగుతున్నది. ప్రభుత్వ పరిశీలనకు ఇచ్చే కమిటీలో, రిజిస్ట్రేషను చేయించే కమిటీలో అందరూ అల్పసంఖ్యాక వర్గాలవారే ఉంటారు. కాని నిజానికి పెత్తనం చెలాయించేవారు చట్టప్రకారం ఏ హక్కు లేని అగ్రవర్ణాలవారయి ఉంటారు. అయితే కేవలం పేరు కోసమని కమిటీలో స్థానమేర్పరచబడినవారు రేపు తిరగబడితే ఏమవుతుందోనన్న భయంతో కొందరు బాప్టిజం స్వీకరించి హఠాత్తుగా అల్పసంఖ్యాకవర్గాల జాబితాలోకి చొరబడినవారూ ఉన్నారు. ఇటీవల కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో పుట్టగొడుగుల్లాగా వెలిసిన ఇంజనీరింగ్ కళాశాలల్లో, బి.ఇడి కళాశాలల్లో ఎక్కువభాగం ఇలాంటివారి కృషితో ఏర్పడినవే.

మైనారిటీ సంస్థలలో ప్రవేశం కోసమని మతం మార్చుకొంటున్న విద్యార్థుల సంఖ్య కూడా తక్కువేమీ కాదు. ఇప్పటివరకు వృత్తి విద్యాకళాశాలలను అయితే ప్రభుత్వము, లేదంటే అల్పసంఖ్యాక వర్గాలు, కాదంటే లాభార్జన దృష్టి గల వ్యాపార వేత్తలు మాత్రమే నిర్వహిస్తున్న స్థితి నుండి సేవాభావం గలిగిన ట్రస్టులు ముందుకు వచ్చి తగిన సంఖ్యలో విద్యాసంస్థలను ప్రారంభించేవరకు ఈ ధోరణి మారకపోవచ్చు. అలా ప్రారంభించడానికి తగిన ప్రాతిపదికను ఈ తీర్పు ఏర్పరుస్తోంది.

## మతపరమైన అల్పసంఖ్యావర్గాలపై ప్రభావం.

ఇప్పటివరకు వారికి గల అవకాశాలను వేటినీ ఈ తీర్పు రద్దు చేయలేదు. కాబట్టి వారు వీధుల లోకి వచ్చి గుండెలు బాదుకొంటూ రోదించేందుకు అస్కారం లేదు. అయితే పెద్దపెద్ద పెట్టుబడులతో వృత్తివిద్యా కళాశాలలను, ఇతర ఉన్నత విద్యాలయాలను కళాశాలలు, ఇతర ఉన్నత విద్యాలయాలను నెలకొల్పటం వెనుక

ఉద్దేశాలు స్పష్టమైనవే. ఆ ఉద్దేశాల పరిపూర్తి కొరకు సరిక్రొత్త వ్యూహరచన చేయకమానరు. భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాల భాషల బోధనను రాష్ట్ర ప్రభుత్వాలు పరిత్యజించే సమయంలో, ఆ పనిని వీరు తమ భుజాల కెత్తుకోవచ్చు. విదేశాలనుండే గాక ఆయా భాషా వర్గాల వారు అధికారంలో ఉన్న రాష్ట్రాల నుండి కూడా విరాళాలు సంపాదించుకోవచ్చు. భాష నేర్పుతున్నామంటూ ఏర్పాటు చేసిన విద్యాసంస్థల ద్వారా, ప్రత్యేక తరగతుల ద్వారా మతవ్యాప్తికి ప్రయత్నించవచ్చు. ఆ మాటకు వస్తే మతపరమైన అల్పసంఖ్యావర్గాలే కాదు, వివిధ రాష్ట్రప్రభుత్వాల వద్ద పలుకుబడి గలిగిన రాజకీయ దళారులు కూడా తమ భాషా సంస్కృతుల వికాసానికి కృషిచేస్తున్నామంటూ ధనాన్ని మూటగట్టుకొనే యత్నం చేయవచ్చు.

## మైనారిటీ హక్కులు

మైనారిటీలకు ప్రత్యేక హక్కులు ప్రసాదించిన కారణంగా మన దేశానికి ప్రపంచమంతటా ప్రశంసలు లభించాయని, ఇప్పటి ఈ తీర్పువల్ల ఆ స్థితిని కోల్పోతామని, జరుగరాని నష్టమేదో జరిగిపోతోందని కొందరు పాత్రికేయులు వ్యాఖ్యానించటం మనం గమనించవచ్చు. దేశము, దేశంలోని కోటానుకోట్ల సామాన్య ప్రజానీకము, వారి శ్రేయస్సు ఏమైనా ఫరవాలేదు, మైనారిటీలకు గల 'వీటో' వంటి హక్కులను పరిరక్షించవలసిందే అని వీరి వాదం. విద్యాసంస్థలను ప్రారంభించే ముందు ప్రభుత్వానికి అనుమతికై దరఖాస్తు చేసికోవాలని, గుర్తింపు పొందితీరాలని నిబంధనలున్న రోజులలో మైనారిటీ విద్యాసంస్థలవారు సమాచారమిచ్చినట్లయితే చాలు - గుర్తింపు పొందినట్లే అన్న స్థితి ఉండేది. ప్రభుత్వాలు రూపొందించే ఏ నియమనిబంధనలకైనా సరే వారు అతీతులు ధోరణి విద్యారంగంలో వ్యాపార ధోరణులు ప్రబలడానికి దారితీసింది. మోసగాళ్లకు అవకాశాలు కల్పించింది.

ఈ వీటో అధికారపు వాదాన్ని, సర్వంసహా స్వాతంత్ర్యమనే వాదాన్ని నిరాకరిస్తూ సర్వోచ్చ న్యాయస్థానం ఇచ్చిన తీర్పు సర్వథా స్వాగతించదగినది. అయితే అవినీతి మార్గాలకు అలవాటు పడిన వారు దీనిని అమలుచేసే పద్ధతులలోనూ లొసుగులు వెదుకుతారు. దొడ్డిదారిన లాభార్జన పరులకు ప్రవేశం కల్పించి పెద్దపీటలపై కూర్చోబెట్టి అమాయక ప్రజానీకాన్ని వంచించే యత్నాలు చేస్తూనే ఉంటారు. కొన్ని కొన్ని రాష్ట్రప్రభుత్వాల వారు ఈ తీర్పును ప్రక్కన పెట్టేందుకు యత్నిస్తూ తమ రాష్ట్రాలలో శాసనాలు చేసినా చేయవచ్చు. అటువంటి కుయుక్తుల పట్ల జాగరూకతతో వ్యవహరించే బాధ్యతప్రజలపై వుంది.

*నడుస్తున్న చరిత్ర డిశంబరు 2002*

# కాషాయీకరణం కాకిగోలకు మూలకారణం ఏమిటి ?

ఈ దేశానికి సుదీర్ఘమైన చరిత్ర ఉంది. కొన్ని వేల సంవత్సరాలుగా నాగరిక జీవితం ఉంది. పాడి పంటలతో వర్ధిల్లుతూ, అన్నార్తులకు ఆశ్రయమిచ్చే ఉదారస్వభావులైన ప్రజలు ఒక జాతిగా ఇక్కడ జీవిస్తూ ఉన్నారు...... ఇలా చెప్పే మాటలను వేటినీ మార్క్సు పుత్రులు గాని, మెకాలే పుత్రులు గాని, మహమ్మదు పుత్రులు గానీ నమ్మరు; ఒప్పుకోరు. ఎందుకంటే పదేళ్ల క్రిందట విచ్ఛిన్నమైపోయిన సోవియెట్ యూనియన్‌లోవలె ఇక్కడ కూడా భాషల వారీగా అనేక జాతులు ఉన్నవని, అవన్నీ స్వయం నిర్ణయాధికారానికి అర్హమైనవని స్టాలిన్, లెనిన్ వంటి వారు చెప్పారు. ఇదొక ధర్మ సత్రం వంటిదని, ఎవరి దగ్గర కఱ్ఱ ఉంటే, బఱ్ఱెను తోలుకొని పోయే అధికారం వారిదని, పరస్పరం ఘర్షణలలో మునిగి తేలుతున్న నల్ల జాతి వారిని ఉద్ధరించడానికి భగవంతుడు తమ నెత్తిన పెట్టిన భారాన్ని మోస్తూ తెల్ల దొరలం వచ్చామని మెకాలే ప్రభువు, అయన సహచరులు, అనుచరులూ చెప్పారు. ఏ దేశానికైనా, ఏ స్థలానికైనా మహమ్మదీయుల స్వాధీనంలోకి వచ్చిన నాటి నుండే చరిత్ర ప్రారంభమవుతుందని, అంతకు ముందు జరిగినవేవీ లెక్కకురావని మహమ్మదీయ చారిత్రక వేత్తలు చెప్పారు.

ఈ దేశం మొదటి నుండీ హిందూదేశమే అనే మాట కాదనటం కోసం పై మూడు శ్రేణుల వారూ అర్యజాతివారు ఎక్కడి నుండో వచ్చి సింధునదీ తీరాన ఉన్న నాగరికులైన ద్రావిడులను దక్షిణానికి తరిమివేసారనే సిద్ధాంతాన్ని పట్టుకొని వెళ్లాడుతూ వచ్చారు. అసలు ఆ ద్రావిడులూ బయట నుండే వచ్చారన్నారు. ఇక్కడి నిజమైన భూమి పుత్రులంతా అగ్రవర్ణాల అత్యాచారాలు భరించలేక కొందరు క్రైస్తవులుగాను, కొందరు మహమ్మదీయులుగాను, మారిపోయారన్నారు. ఆర్యులు అనగా హిందువులు ఈ దేశానికి విదేశీయులని, క్రైస్తవులూ, మహమ్మదీయులు, దళితులు, గిరిజనులు మాత్రమే స్వచ్ఛమైన స్వదేశీయులని వక్రభాష్యాలు ప్రారంభించారు.

అయితే గత ఇరవై అయిదు సంవత్సరాలుగా మన దేశంలో జరుగుతున్న పరిశోధనలు, యూరోపు, అమెరికాలలో జరుగుతున్న అధ్యయనాలు కలసి కథంతా మార్చివేశాయి.

పశ్చిమబెంగాల్‌కు చెందిన నట్వర్ ఝా అనే విద్వాంసుడు, అమెరికాలో హార్వార్డు విశ్వవిద్యాలయానికి చెందిన నవరత్న ఎస్-రాజారాంతో కలసి సింధులిపిని ఎలా చదవాలో కనిపెట్టి దానిని వివరిస్తూ ఒక పుస్తకం వెలువరించాడు. ఇటీవల (గత మూడు నాలుగు సంవత్సరాలలో) జరిగిన ఈ ఊహించని పరిణామంతో ఆర్యుల దండయాత్ర సిద్ధాంతం దూది పింజలాగా కొట్టుకుపోయింది!

## సింధులిపి గుర్తింపు ఎలా సాధ్యమైంది.

ఆర్యులు క్రీ.పూ. 1500 సం॥ క్రిందట ఈ దేశానికి దండయాత్రగా వచ్చారని, ఆ తర్వాత కొంతకాలానికి ఋగ్వేదం రూపొందించారని, వారు స్థానికులతో చేసిన యుద్ధాలే రామాయణ మహాభారతాలని ఆంగ్లేయుల పాలనా కాలంలో మనకు నూరిపోశారు. క్రీ.పూ. 3100 నుండి 1900 సం॥ వరకు విలసిల్లిన సింధు నాగరికత (మొహంజోదారో, హరప్పా వగైరాలు) ఆర్య సంబంధమైనది కావటానికి వీలులేదు. వీరిభాషకు సంస్కృతంతో ఏవిధమైన సంబంధం ఉండడానికి వీలులేదు. పైగా కొందరు పరిశోధకులు సింధు నాగరికులను ద్రావిడుల కంటే పూర్వులుగా, వారిభాష ద్రావిడ భాషకు పూర్వరూపంగా సిద్ధాంతీకరించారు కూడాను. కాబట్టి ఈ సిద్ధాంతాల ననుసరించి ఎంత పరిశీలించినా సింధులిపిని ఎలా గుర్తించాలో వారికి ఎప్పటికీ తెలియలేదు.

అయితే నట్వర్‌ఝా గారికి ఒక సందేహం కలిగింది. ఆర్యులు అలలు అలలుగా దండయాత్ర చేసి అల్లకల్లోలం సృష్టించారని ఈ ఒకటిన్నర శతాబ్దాలుగా చెప్తున్నారుగదా! మరి మనదైన సాహిత్యంలో ఎక్కడా దీని గురించిన ప్రస్తావన ఇసుమంత కూడా లేదేమిటి? అని తర్కించుకొంటూ మహాభారతాన్ని చదువ నారంభించారు. శాంతి పర్వంలో వారికి ఒక శ్లోకం కనిపించింది.

విద్ధిమాం వృషముత్తమం ఏకశృంగ ........

........ దివ్య దర్శనాః త్రికకుత్ తేన విఖ్యాతాః

ఉత్తమ జాతికి చెందిన ఎద్దు, ఒక కొమ్ముగల దివ్యరూపము, మూడు శరీర భాగాలతో ప్రసిద్ధమైనది. ఇలా మూడురూపాలలో నేను ఉన్నానని గ్రహించుము అనే శ్లోకం చదువుతూ ఉండగా సింధులోయ నాణెముల మీద సీళ్లమీద ఇలాంటి గుర్తులు ఉన్నట్లుగా జ్ఞప్తికి వచ్చింది. ఆ నాణెములను, వాటిపై అక్షరాలను పరిశీలించగా అచ్చులు

వినియోగించ కుండా కేవలం హల్లులు మాత్రమే ఉపయోగించిన ఆ లిపి బ్రాహ్మీలిపికి అతిసన్నిహితంగా ఉందని గుర్తించారు. ఇందుకు యాస్కుడనే మహర్షి రచించిన నిరుక్తము, నిఘంటుక పదఖ్యానము ఉపకరించాయి. నాణెలపై ఉన్న పదాలు ఈ నిఘంటువులలో ఉన్నవే.

సింధులిపిలో హల్లులు మాత్రమే ఉండి అచ్చులు లేకపోవటం ఆశ్చర్యం కలిగించదు. ఎందు కంటే హిబ్రూ, అరబిక్ భాషల వ్రాతలో ఈ నాటికీ అచ్చుల వాడకంలేదు. నరత్తమ అనివ్రాసి ఉన్నదానిని నరోత్తమ అని వివేకంతో చదువ గల్గారు. ఇలా వందల, వేల పదాలను చదివి అన్వయించుకోవటంలో సఫలులైనారు. అయితే పదం మొదట్లోనే అచ్చు ఉన్నట్లయితే అఆఇఈఉఊ ఏదైనా సరే "U" అనే గుర్తును సింధులిపిలో ఉపయోగించారు. Uగ్న అంటే అగ్ని అని Uశ్వర అంటే ఈశ్వర అని సందర్భాన్ని బట్టి గ్రహించుకోవాలి.

## సింధులిపి గుర్తింపు పర్యవసానాలు:

1) వైదిక జీవన విధానం సింధు నాగరికత కంటే పాతదని స్పష్టమైంది.
2) ఆర్యుల దండయాత్ర, ఆర్యుల వలస సిద్ధాంతాలు కొట్టుకుపోయాయి.
3) సింధు నాగరికత వైదిక జీవన విధానంలో భాగమేనని స్పష్టమైంది.
4) మధ్య ఆసియా, యూరోప్‌ల నుండి ఆర్యులు అనే జాతివారు రాలేదు సరిగదా, ఇక్కడి వారే ప్రపంచంలో వివిధ దిశలలో వ్యాపించారని చెప్పడానికి ఆధారాలు లభించాయి. సంస్కృతానికి, యూరోపియన్ భాషలతో కొన్ని పదాల మధ్య సారూప్యం ఇలా ఏర్పడినదే.

   ఉదా॥ మాతా - మదర్, భ్రాతా - బ్రదర్, నావ - నేవీ, పోత - బోట్

5) చారిత్రక సత్యాలను వెలికి తీయడానికి భారతీయ సాహిత్యంలోని ఆధారాలూ ఉపయోగపడతాయని తెలిసివచ్చింది. ఋగ్వేదంలో నౌకాయానం గురించిన ప్రసక్తి ఉంది. నలుదిక్కులలో ఉన్న ఇంద్ర, వరుణ, కుబేర, యమధర్మరాజులను ప్రార్థించే శ్లోకాలు భారతదేశానికే వర్తిస్తాయి. అందునా హిందూ స్థానం ద్వీపకల్పానికి బాగావర్తిస్తాయి.

**వింధ్యస్య దక్షిణేదేశే గోదా కావేరీ యత్రస్థితా:**

**తత్ర వేదాశ్చ యజ్ఞశ్చ భవిష్యతి కలౌయుగే**

వంటి శ్లోకాలను బట్టి, అగ్నిమీళే పురోహితం అన్న ఋగ్వేద ప్రారంభ వాక్యంలోని 'ళ' శబ్దాన్నిబట్టి (ళ శబ్దం తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు, మరాఠీ

భాషలలోనే ఉంది. ఇతర ఉత్తరాది భాషలలో లేదు) వేదాధ్యయనము ఉత్తరాది ఆర్యులకు పరిమితంకాదని, దక్షిణాదిన ఉన్న ద్రావిడులూ వేదాధ్యయన సంపన్నులేనని స్పష్టమవుతుంది.

6) ఆర్య - ద్రావిడ విభేదాలు కేవలం 19, 20 శతాబ్దాలలో యూరోపు వాసులు తమ సామ్రాజ్యవాదపు కుట్రలో భాగంగా రూపొందించినవేగాని, ఆర్యద్రావిడ జాతులన్నవి లేవని స్పష్టపడుతుంది. ('ఆర్య' సంస్కృతిని తెలుపుతుంది. 'ద్రవిడ' భౌగోళికమైన ఉనికిని తెలుపుతుంది. ఒకేవ్యక్తి ఆర్యుడు, ద్రావిడుడు కావడానికి అభ్యంతరంలేదు).

7) బిషప్ కాల్డ్వెల్ తదితరులు ప్రతిపాదించిన ద్రవిడ భాషా కుటుంబ సిద్ధాంతం వంటివి కృత్రిమమైనవని, తగిన ఆధారాలున్నవి కావని తేలిపోయింది.

## ఇంకా ఏమి జరగబోతున్నది ?

ఎప్పుడైతే సుదీర్ఘ చరిత్ర గల్గిన జాతి ఇక్కడ నివసిస్తున్నదని అంగీకరిస్తామో, తరువాత వచ్చినవారు మూలప్రవాహంతో సర్దుబాటు చేసికొని జీవించాలని సహజంగా భావిస్తాం. అంటే మహమ్మదీయులుగాని, క్రైస్తవులుగాని, అల్ప సంఖ్యాకవర్గాల మంటూ రాగాలు తీయటంగాని, ప్రత్యేక హక్కులంటూ పేచీలు పెట్టటంగానీ లేకుండా - ఈ జాతి ప్రయోజనాలకు ఏవిధమైన విఘాతమూ కలుగని రీతిలో మసలుకోవాలని ఎవరైనా చెప్తారు.

అయితే మైనారిటీల ఓటు బ్యాంకులలోనే తమ రాజకీయమైన అదృష్టం దాగి ఉందని భావిస్తున్న వామపక్షాలూ, కాంగ్రెసు, ముస్లింలీగు వగైరాలు ఇందుకు సిద్ధపడవు. అలాగని ఈనాడు సాక్ష్యాధారాలతో ఋజువైనదానిని కాదని వాదించి గెలిచే దమ్మూ లేదు. అందుకని అసలు విషయం మాట్లాడకుండా కాషాయీకరణమనే కాకిగోల ప్రారంభించారు. జ్యోతిషము, సంస్కృతములకు పెద్దపీటవేస్తున్నారు. వీటివల్ల మనసెక్యులరిజం మైలబడిపోతోంది, మంట గలసిపోతోందని అరుస్తున్నారు. ప్రజల దృష్టిని ప్రక్కదారి పట్టించటమే ఈ కేకల అసలు ఉద్దేశ్యం.

అయితే లోక్‌సభలో శ్రీ మురళీ మనోహర జోషీ ప్రతి విషయానికీ దీటయిన సమాధానం చెప్పటంతో ఢిల్లీ విడచిపెట్టి గల్లీలో లొల్లి మొదలు పెట్టారు. ఇప్పుడు జాతీయ ప్రయోజనాలను కాపాడుకోవాలని భావించే చైతన్య వంతులు కొందరు వివిధ స్థాయిలలో సభలు, సదస్సులు ఏర్పాటుచేస్తూ పై విషయాలను వివరించటం ప్రారంభించిన కారణంగా - ఇక లాభంలేదని క్రొత్త సమస్యల వేటలో పడుతున్నారు.

- జాగృతి సెప్టెంబరు 2001

# భావదాస్యం వదిలితేనే ఆర్థిక దాస్యం తొలగే దారి ఏర్పడుతుంది

తెల్లవాడు చాలా గొప్పవాడు. మన వాళ్లకు చుట్టకాల్చటం నేర్పి, అదే మహోపకారమని మనతో అనిపించటంలోనే ఉంది వాడి ప్రజ్ఞ. మనం సరిగా గమనించని మరో గొప్పతనం కూడా వాడిలో ఉంది. వాడు చేసిన పాపాలన్నింటినీ తెలివిగా మనమీద రుద్దేయటం. వాడు చేస్తున్న తప్పులకు ఎవరైనా వాడిని 'రెడ్‌హాండెడ్'గా పట్టుకొన్నా, ఈపని నేనే మొదటగా చేయలేదు. నీవు, నీవు గాకపోతే నీతాత, ఆయన కాకపోతే ఆయన ముత్తాత చేసిన పనులే ఇవి అని దబాయించటమే ఆ గొప్పతనంలోని నిజమైన గొప్పతనం.

తమదేశాలలో తింటానికి తిండిలేక, చేయడానికి సముద్రాలపై దొంగతనం కాక మరొక పనిలేక, ఉత్పత్తి చేయడానికి అమ్ముకొనడానికి గొడ్డుబొచ్చు తప్ప మరో సరుకు లేక వారు దేశాలపై పడ్డారు. ఒక్క బలహీనమైన కొక్కెంతెగినా చాలు గొలుసు తెగినట్లే అన్నట్లుగా దేశ మంతా మహారాష్ట్రుల చేతిలో సురక్షితంగా ఉన్నా, బెంగాలులో నవాబుమీద క్రుద్ధుడై ఉన్న మీర్జాఫర్ సహాయపడటంతో ప్లాసీ యుద్ధం గెలిచి హిందూ దేశపు కోటలో పాగావేశారు అంగ్లేయులు. ఇక్కడ ఇంకొక మాట కూడా చెప్పుకోవాలి లంచాలిచ్చే కానుకలిచ్చే ఇతర దేశాల ప్రభువులను బుట్టలో వేసికోవటంలో కూడా వారుఎంతో సామర్థ్యం కలవారు. కాబట్టే జహంగీర్‌ను మెప్పించి దిగుమతి సుంకం కట్టకుండా వ్యాపారం చేసికొనడానికి అనుమతి సంపాదించినట్లే, మీర్జాఫర్‌ను నవాబును చేసిన పిదప పన్నులు వసూలుచేసి ఖజానాలో జమకట్టే దివానీ బాధ్యతలు

చేజిక్కించుకొన్నారు. ఖజానాలో జమ చేయలేదేమని అడిగినందుకు మీర్జాఫర్‌ను తొలగించి మరో మీర్‌ఖాసింను నవాబును చేసి, తమ పన్ను వసూళ్ల క్షేత్రాన్ని విస్తరింపజేసి కొన్నారు. రెండు పిల్లుల మధ్య రొట్టెను త్రుంచి తూకం వేస్తూ మొత్తం మ్రింగవేసిన కోతి కథ ఇక్కడిదే. మీర్‌జాఫర్ - మీర్ ఖాసింల మధ్య నవాబు పదవిని బదలాయిస్తూ క్రమక్రమంగా బెంగాలు అంతటినీ తమ హస్తగతం చేసికొన్నారు. అక్కడ దొరికిన బంగారంతో దేశంలోని అన్ని రేవు పట్టణాలలోనూ వ్యాపారంలో ఆధిక్యం సంపాదించారు. పెంచిన పన్నులు కట్టజాలక దిక్కులు చూస్తున్న రైతులను కూలీలు గానో, బానిసలుగానో ఇతర వలస దేశాలకు తరలించి అక్కడ చెరకు, ప్రత్తి మొదలైన పంటలు పండింపచేశారు. ఇక్కడి బంగారం, అక్కడి ముడి సరకులు, ఇక్కడి ముడి సరకులు వినియోగించుకొని పారిశ్రామిక విప్లవం సాధించారు. ఇక్కడి యువకులను సైన్యంలో చేర్చుకుని యావద్భారత దేశాన్ని, ఆ తరువాత రవి అస్తమించని సామ్రాజ్యాన్ని సాధించారు. అయితే ఎప్పటికైనా ఇక్కడివారు ఎదురు తిరుగుతారని, మా మీద మీ పెత్తనం ఏమిటని ప్రశ్నిస్తారని వారికి తెలుసు. దానికి విరుగుడుగా వారు కొన్ని సిద్ధాంతాలను శాస్త్రవేత్తలు పరిశోధించి కనుగొన్నట్లుగా ప్రచారం చేశారు.

## ఇదొక దేశమేకాదు!

ఇక్కడ ఒకదేశంగాని, జాతి గాని లేదని ఎవరెవరో గుంపులు గుంపులుగా నివసిస్తున్నారని వీరందరూ కాలక్రమంలో ఇలాంటి గుంపులుగా బయట నుండి వచ్చినవారేనని, వారికి ఆయా రోజుల్లో ఉన్న కండబలాన్ని బట్టి వారి రాజ్యం నడుస్తూ ఉండేదని చెప్పారు. ఈ దేశపు మూలనివాసులంటూ ఉంటే వారు ఇప్పటికీ అనాగరికులుగా పాతరాతియుగం నాటి వారిగా ఉండిపోయిన ఆదివాసులేనని ఇక మిగిలిన వారందరూ ద్రావిడులూ, ఆర్యులు, పఠాన్లు, తురుష్కులు అందరూ బయటివారేనని చెప్పారు. 16వ శతాబ్దారంభంలో అమెరికాలో ఏవిధంగా శ్వేతజాతీయులు రెడ్ ఇండియన్లను చిమ్మచీకటి అడవుల అంతర్భాగాల్లోకి తరిమేశారో, కొన్నివేల సంవత్సరాల క్రిందట ద్రావిడులు ఆదివాసులను అలాగే తరిమేశారని, ఆ తర్వాత దండయాత్రగా వచ్చిన ఆర్యులు ద్రావిడులను దక్షిణ హిందూ దేశానికి తోలేసి ఉత్తర హిందూదేశానికి ఆర్యావర్తమని పేరు పెట్టారని చెప్పారు. ఆ వరుసలోనే ఆర్యులు పంజాబ్ ప్రాంతంలో ఉండగా మహా భారత యుద్ధం జరిగిందని, వారింకా ముందుకు గంగా, సరయూ ప్రాంతాలకు వచ్చిన తర్వాత రామాయణం జరిగిందని అడ్డదిడ్డంగా వ్రాసేశారు.

ఉద్యోగాలిచ్చేది, జీతాలిచ్చేది తెల్లవాడేగదా! వారి చదువులు చదివి, వారి పరీక్షలు వ్రాసి, వారిచ్చే యోగ్యతాపత్రాలు, పట్టాలు అందుకొన్న వారికే గదా ఉద్యోగాలు లభించేది! ఆ చదువులే మనవారు చదువకతప్పలేదు. ఇప్పటిలా చర్చచేయడానికి అప్పట్లో ప్రజాస్వామ్యము, వాక్స్వా తంత్ర్యమూ, పత్రికా స్వాతంత్ర్యమూ ఉన్నాయా? చదువుకొన్న డూడూ బసవన్నలు తగినంత సంఖ్యలో తయారైనారు. ఇంతలో కాలం మారింది. రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. ఇంగ్లీషు వారు బాగా నష్టపోయారు. నెత్తిన కిరీటం పెట్టుకోవటం ముఖ్యమా? ఒంటిమీద బట్టకట్టు కోవటం ముఖ్యమా? అన్న సమస్య ఎదురైంది. తమ దేశము, తమ జాతి ప్రజలు, వారి ప్రయోజనాలు వీటి గురించి వారికి నిబద్ధత ఉంది. కాబట్టి తమ వలసదేశాల్లో వివిధ హోదాల్లో ఉన్న నమ్మకస్థులయిన తమ వారిని వెనుకకు పిలుచుకొని దేశ పునర్నిర్మాణానికి ప్రాధాన్యం ఇవ్వాలని నిర్ణయించుకున్నారు. కొన్నాళ్ళు తమ తరపున పేరిగాళ్ళు పరిపాలించినా తమ కేమీ నష్టంలేదని, తమ ఇంటి పరిస్థితులు చక్కదిద్దుకొన్న తర్వాత మళ్లీ సామ్రాజ్యం విషయం చూసికొనవచ్చులే అనుకొన్నారు. మనదేశాన్ని వారి పద్ధతిలో విద్యాబుద్ధులు నేర్చుకొన్నవారికి అప్పగించి, మనదేశాన్ని బ్రిటీషు కామన్వెల్తులో చేర్చుకుని వెళ్లిపోయారు.

## డూడూ బసవన్నలు

దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. మన దేశ పునర్నిర్మాణం చేసికొనే బాధ్యత మన మీదనే ఉంది అని గ్రహించుకొన్నవారు తక్కువగా ఉండగా, పాదుకలను సింహాసనంపై పదిలంగా ఉంచి పరిపాలన చేస్తున్న తీరులో బ్రిటీషువారు బట్టీ పట్టించిన సిద్ధాంతాలను ఒదలకుండా అంటి పెట్టుకున్నవారు రకరకాల పదవుల్లో కుదురు కొన్నారు. దాని ఫలితమే శాస్త్ర విజ్ఞానం ఎంతో విస్తరించి, ఎన్నో విషయాలు బైటపడి, ఆర్యుల దండయాత్ర సిద్ధాంతం ఒక బూటకం, కట్టుకథ అని తెలిసిన తర్వాత కూడా దానిని ఒదిలిపెట్ట జాలని బసవన్నలు ఇప్పటికీ సృష్టిస్తున్న గందర గోళం. విజ్ఞానం విస్తరిస్తోంది కళ్లు తెరుచుకొని సత్యాన్ని చూడండయ్యా అని వివరిస్తుంటే అదిగదిగో చరిత్రకు కాషాయంరంగు పులుముతున్నారంటూ వీరంగం వేస్తుంటారు.

వేదాలను పవిత్రంగా భావించి సంస్కృత భాష మాట్లాడే ఆర్యులనబడేవారు ఐరోపా నుండో, మధ్య ఆసియా నుండో, ఈ రెండూ కలిసే చోట నుండో హిందూ దేశపు వాయువ్య దిశనుండి సప్తనదులు ప్రవహించిన ప్రాంతంలోకి దండయాత్రగా వచ్చారనేది ఈ ఆర్యుల దండయాత్ర సిద్ధాంతం. అయితే 20వ శతాబ్దపు తొలినాళ్లలో సింధునది సమీపంలో, పంజాబ్‌లో జరిపిన త్రవ్వకాలలో అత్యున్నత స్థాయి నాగరికత అవశేషాలు బయల్పడినాయి. దానికి సింధునాగరికత అని పేరు పెట్టి అది ద్రావిడుల నాగరికత గాని, అంతకు ముందు వారిది గాని అయి ఉండాలన్నారు.

అప్పటికి ఆర్కియాలజీ, ఇండాలజీ, లింగ్విస్టిక్స్ మొదలైన నూతనంగా ప్రారంభమైన శాస్త్రాలను చదివిన భారతీయుల సంఖ్య చాలా తక్కువ. స్వామి వివేకానందుడు ఆ సిద్ధాంతాన్ని ఖండించినా, ఈ శాస్త్రాలను ఆధారం చేసికొని ఆంగ్లేయులను ప్రశ్నించిన వారు లేకపోయారు. ఇప్పుడు మరిన్ని విషయాలు వెలుగులోకి వస్తున్నాయి. నవరత్న రాజారాం, నట్వర్‌ఝా అనే వారు సంయుక్తంగా సింధు లిపిని తాము చదువ గలిగామని ఆనాటి నాణెములపై, రాతిపలకపై ఉన్న వాటికి అర్థం తెలియజేస్తూ ఒక పుస్తకం వ్రాశారు. ఆర్యులు ద్రావిడులూ వేఱువేఱుగా లేరని, ఆర్యులనేవారు వాయువ్యదిశ నుండి బయటనుండి వచ్చారని చెప్పటం తప్పని, భారతీయులందరూ ఒక్క తెగకు చెందిన వారేనని వారు వ్రాశారు. కాగా ఈ విషయాలన్ని వదిలిపెట్టి, ఒక నాణెం మీద ఒక జంతువు యొక్క వెనుక సగభాగం కనిపించుతుంటే అది ఎద్దు కాగా, గుఱ్ఱమని వాదిస్తున్నారని, ఆ రకంగా రాజారాం వ్రాసింది అంతా తప్పేనని నిరూపించడానికి బసవన్నల పక్షం పెద్ద ఎత్తున యత్నిస్తోంది.

## ఇవీ నిజాలు

ఆ ప్రయత్నాలను త్రిప్పికొడ్తూ, రాజారాం ఇస్తున్న వివరణలు ఆలోచింపచేస్తున్నవి.

1. ఋగ్వేదము, ఇతరవేదాలు మొదలైన సాహిత్యం కలిగి ఉన్న ఆర్యులు అనుశ్రుతంగా తరతరాలుగా నేర్పుకొంటూ తమ సాహిత్యాన్ని నిలుపుకొంటూ వచ్చారేగాని, ఆ రోజులలో వారి భాషకు లిపి ఉన్న ఆధారాలు ఇంత వరకు దొరకలేదని ఆర్యుల దండయాత్రసిద్ధాంత కర్తలు చెప్తున్నారు. లిపి లేకుండానే ఇన్ని వేల సంవత్సరాలుగా వారి సాహిత్యం మనగల్గింది. కాగా అత్యున్నత స్థాయిలో నాగరికతను తీర్చి దిద్దుకొని లిపి కలిగి ఉన్న సింధు ప్రజలకేమో సాహిత్యం లేదు! ఇంత వరకు ఒక గ్రంథం కూడా ఇది సింధు ప్రజలది అని చెప్పేది దొరకలేదు. ఇది వింతగా లేదూ? ఈ ఇద్దరూ వేఱువేఱు కాదు; ఒక్కరే అనుకుంటే సమస్య పరిష్కారమై పోతుందని డేవిడ్‌ఫ్రాలే సూచిస్తున్నారు. సింధులిపిని చదవటంలో కృతకృత్యులైన తమ కృషి ఈ విషయాన్ని బలపరుస్తోంది.

2. సింధు నాగరికతనాటి నాణెముల మీద సీళ్లమీద ఈనాడు మనం విరివిగా చూస్తున్న 36 ప్రక్క టెముకలు ఉండే గుఱ్ఱాలు లేని మాట నిజమే. అయితే ఆనాడు ఈ దేశంలో 34 ప్రక్కటెముకలు ఉండే గుఱ్ఱాలు ఉండేవి (వీటిని బోన్ ఇండికా అంటారు) వాటిని వినియోగించుకునే అశ్వమేధాది యాగాలు జరిగేవి. పైన చెప్పిన నాణెం మీద, ఇంకా అనేక ఆధారాలలోనూ ఈ గుఱ్ఱాలు కనిపించుతున్నాయి. తరువాత కాలంలో పర్షియా నుండి ప్రవేశపెట్టబడిన గుఱ్ఱాలను పోలి లేనంత మాత్రాన సింధు

ప్రజలకు గుఱ్ఱమే తెలియదని, అశ్వమేధాది యాగాలను చేసిన ఆర్యులూ వీరూ ఒకటి కారని చెప్పటం నిలిచే వాదం కాదు.

3. ఋగ్వేదంతో సహా ఆర్యుల సాహిత్యంగా చెప్పబడే దానిలో సముద్రాన్ని గురించి, సముద్రయానాన్ని గురించి, నౌకాయానం గురించి ఎన్నో ప్రస్తావనలున్నాయి, హిందూదేశపు వాయువ్యదిశ నుండి వచ్చారని భావించుకొనేవారికి సముద్ర యానం గురించి ఇంతగా తెలిసే అవకాశం లేదు. కాబట్టి ఋగ్వేదాన్ని పఠించిన ఆర్యులకు హిందూ దేశపు దక్షిణ భాగంతోనూ ఆగ్నేయా ఆసియాలోని ద్వీపాలతోనూ సంబంధం ఎక్కువ ఉండేదని భావించటమే సమంజసం.

4. మన దేశపు సంస్కృతి, నాగరికత, వాణిజ్య పరమైన సంబంధాలు ఉత్తర, వాయువ్య దిశలలో గాక తూర్పు, ఆగ్నేయ, దక్షిణ దిశలలో ఎక్కువగా ఉన్నాయి. ఐరోపా మనకు వాయువ్యంగా ఉంది కాబట్టి ఆనాటి ఆర్యులు వాయువ్య దిశనుండి పశుగణాలను తోలుకుంటూ పర్వతాల మధ్య నుండి రథారూఢులై వచ్చారనటం నమ్మదగ్గదిగా లేదు.

5. సంస్కృతానికి ఈనాటి ఐరోపా భాషలకు ఉమ్మడి మాతృక అయిన ఏదో భాషను ఆర్యులు మాట్లాడేవారన్న వాదన భాషాధ్యన శాస్త్రం (లింగ్విస్టిక్స్) లోని గత అయిదారు దశాబ్దాల పరిశోధనల్లో వెలుగులోకి వచ్చిన నూతన విషయాల ముందు నిలవటం లేదు.

6. ఋగ్వేదము, ఆర్యుల సాహిత్యంగా చెప్పబడుతున్న ఇతర గ్రంథాలను సమగ్రంగా అర్థం చేసికొనడానికి వారు సప్తసింధులోయలో ఉండే వారనే దృష్టితో కాకుండా, సముద్రతీరవాసులు, సముద్రాలకు అవతల నివసించేవారు అయిన దక్షిణ ప్రాంతపు ఋషులు కూడా ఈ గ్రంథాల రూపకల్పనలో భాగస్వాములయి ఉంటారనే దృష్టితో పరిశీలన జరుగవలసి వుంది. అప్పుడు మరిన్ని చిక్కులు విడిపోయి విషయాలు తేటతెల్లంకాగలవు.

మొత్తం మీద మనలో మనం కొట్టుకు చావడానికి కావలసిన విషబీజాలెన్నింటినో చల్లివెళ్లిపోయాడు తెల్లవాడు. సుమారుగా ఆ సమయంలోనే ఇంగ్లీషు తెల్లవాడి స్థానాన్ని అమెరికా తెల్లవాడు ఆక్రమించాడు. ప్రపంచ వాణిజ్య సంస్థ వంటి కొత్త కొత్త బోర్డులు పెట్టించి మన ముడి సరుకులు చౌకగా కొట్టేసి, తమ దగ్గర చెల్లని సరుకులను మన మార్కెట్లో కుప్పపోసి మన చేత కొనిపించి, కొత్త పద్ధతిలో మన మీద స్వారీ చేయడానికి యత్నిస్తున్నాడు. మనమీద మరొకరు ఎక్కి పెత్తనం చేయకుండా చూసికొనే బాధ్యత మనదే గదా! భావదాస్యం వదలకుండా ఆర్థిక దాస్యం తొలగదు.

- నడుస్తున్న చరిత్ర జనవరి 2001

# వామపక్షాలవారు చెప్పే వస్తు నిష్ఠ చరిత్ర ఇది !

చారిత్రక సత్యాలతో వామపక్ష మేధావులు ఇష్టారాజ్యంగా ఎలా వ్యవహరించగలరో, వారు రూపొందించిన పాఠ్యపుస్తకాలు తెలియ జేస్తాయి. ఎన్.సి.ఇ.ఆర్.టి. అంతా కాషాయమయం అయిపోతోందని గగ్గోలుపెట్టేకంటే, వారు తమ లోపాలను చక్కదిద్దుకొనే యత్నం చేయటం అవసరం.

ఎన్.సి.ఇ.ఆర్.టి. రూపొందించిన పాఠ్యగ్రంథాలను పునఃసమీక్షించే విషయమై వామపక్షమేధావులు చేస్తున్న రభసకు ఏ రకమైన సిద్ధాంతాలలోనూ చిక్కుబడకుండా ఉన్న పాఠకులు తమకు కనబడని రహస్యమేదో ఉందని అనుమానించటం ప్రారంభిస్తే, అందుకు వారిని తప్పు పట్టనవసరంలేదు. అసలు సమీక్ష ప్రారంభం కాకుండానే ఏదేదో జరిగిపోతున్నట్లుగా వాపోవటం లోనే - ఇంతకాలంగా వారు బే ఫర్వాగా చేసికొంటూ వచ్చిన తప్పులు ఎక్కడ బయటపడి పోతాయోననే భయం కన్పించుతోంది.

ఏడవ తరగతికి వారు రూపొందించిన మధ్యయుగాలనాటి హిందూ దేశ చరిత్ర పుస్తకాన్ని పైపైన చూసిన వారికి కూడా, వారి చెప్తున్న చరిత్ర పాక్షికమైనదని, పక్షపాతంతోకూడుకొన్నదని ఇట్టే తెలిసిపోతుంది. ఈ ఏడవ తరగతి పుస్తకం వామపక్ష మేధావుల మేధోవిలసనానికి ఒక మచ్చుతునక మాత్రమే.

చారిత్రక సత్యాలను వాస్తవిక దృష్టితో చూడాలని వారు చెప్పే నీతి ఎన్నెన్ని ప్రహారాలకు గురి అయ్యిందో, ఎన్నెన్ని జగమెరిగిన చారిత్రక సత్యాలు ఖూనీ చేయబడినాయో, వక్రీకరింప బడినాయో పరిశీలిద్దాం.

మధ్యయుగంగా చెప్పబడే కాలాన్ని రెండు వందల సంవత్సరాలు ముందుకు జరిపేశారు. భూస్వామ్య విధానం ఈ యుగంలోని లక్షణ మన్నారు. ఈ రెండింటి వెనుక ఉన్నది రాజకీయ దృష్టి కోణమేగాని చారిత్రక పరిశోధన కాదు. ఈ రెండు అంశాలలోనూ ఉన్న ఉద్దేశ్యం ఉత్తరం నుండి మన దేశంపై జరిగిన దాడుల మీద దృష్టి ప్రసరించనీయకుండా, మహమ్మదీయుల కృషి ఫలితంగా భారతదేశంలో సంభవించినదని వారు వాదిస్తున్న రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిణామాల మీద దృష్టిని కేంద్రీకరింపజేయటమే.

అనేకమంది పాశ్చాత్య చరిత్రకారులు ఈ పద్ధతిలోని ఔచిత్యాన్ని ప్రశ్నిస్తున్నారు. మార్క్సిస్టు చరిత్రకారుల చిత్తశుద్ధిని, వారు ప్రస్తావించుతున్న చారిత్రక ఘటనలను, వారికి గల చారిత్రక అవగాహనను శంకిస్తున్నారు.

మధ్యయుగాలనాటి చరిత్రలోకి ప్రవేశించిన కొద్దీ చారిత్రక సత్యాల గురించిన ఘర్షణ పెరుగుతూ పోతోంది. ఇస్లాంరాకతో ఇక్కడి నాగరికత ఎటువంటి ఘర్షణకు గురియైనదో అది వివరించ బడటం లేదు. కొన్ని అంశాలను మాట మాత్రంగా ప్రస్తావించటం కూడా జరగటం లేదు. ఐరోపాలోని చీకటి యుగాన్ని గురించి, భూస్వామ్య యుగాన్ని గురించి ప్రస్తావనలు ఉంటున్నవి, కాని ఇస్లాంలోని మూల సూత్రాలు, మౌలిక ప్రబోధము, ఇస్లామీ రాజ్యతంత్రంలోని మౌలిక సూత్రాలు, ఇస్లామిక్ రాజ్యంలో మహమ్మదీయేతరులకు గల స్థానము, వారికి కలిగిన అనుభవాలూ, ఇస్లాం జయించిన ప్రాంతాలైన ఇరాన్, ఇరాక్, ఈజిప్టు, సిరియాలలో అంతకు ముందు అక్కడ నెలకొని ఉన్న ప్రాచీన నాగరికతలపట్ల నూతన పాలకులు వ్యవహరించిన తీరు - ఇవేవీ ప్రస్తావన చేయబడలేదు.

ఢిల్లీ సుల్తానుల పాలనా కాలాన్ని గురించిన వివరణలో 'ధిమ్మి - జజియా' అనే పదాల ప్రస్తావనే లేదు. ఆనాటి పాలనలో ఈ పదాలకు గల ప్రాధాన్యం ఎంతో కీలకమైంది. పాలకుల జాతి వివక్షను, పాలకవర్గాలు మూర్ఖంగా క్రూరంగా వ్యవహరించిన తీరుల గురించి ఏ మాత్రం పట్టించుకోకుండా దాటవేశారు.

పైగా వారి రాజ్య వ్యవస్థలో హిందువులకు ఎన్నో అవకాశాలు కల్పించారని తప్పుదారి పట్టించే విధంగా ప్రస్తావించారు. బ్రిటీషు వారి పాలనలో కూడా దిగువస్థాయిలో అనేకమంది భారతీయులకు ఉద్యోగాల నిచ్చారు. అంతమాత్రాన బ్రిటీష్ పరిపాలన ఇండియన్ - బ్రిటీషు ఉమ్మడి పరిపాలన అనిపించుకొంటుందా? మహమ్మదీయుల పాలనలో హిందువులకు ఉద్యోగాల నివ్వటమూ అటువంటిదే. కాని ఈ పాఠ్యపుస్తకం ఏమంటుందంటే, హిందూ రాజులు, భూస్వాములు, జమిందారులు, పూజారులూ - వీరందరూ కొత్తగా పుట్టుకొని వచ్చిన నవీన పాలక వర్గాలలో భాగస్వాములేనట!

వాస్తవమేమిటి? రాజస్థాన్‌లోని కొన్ని సంస్థానాధిపతులను మినహాయిస్తే, అందరూ చివరి వరకూ, పాదుషాలతో పోరాడుతూనే ఉన్నారు. వారెవరూ మొగలాయీల రాజతంత్రంలో భాగ స్వాములు కాలేదు. మొగలుల పరిపాలనలో కూడా హిందూ జమిందార్ల ప్రమేయం చాలా చాలా తక్కువ. దాదాపుగా మృగ్యమే. సుల్తానుల కాలంలో వీరందరూ పాలక వర్గాలలో చేరిపోయారనటం చారిత్రక సత్యాలతో ఆటలాడుకొనటమే.

హిందువులను ఏ విధంగా అణచి వేసిందీ తెలియజెప్పకుండా, ఉలేమాలకు, బ్రాహ్మణులకు తమ మతాలను ప్రచారం చేసికొనటంలో సమానావకాశా లిచ్చారని ఈ పుస్తకంలో వ్రాశారు. తీర్థయాత్రలకు పోదల్చిన హిందువులపై పెద్ద ఎత్తున పన్ను విధించారని ఈ పుస్తకం చెప్పదు.

సుల్తాను లందరూ ఇస్లాంను ప్రపంచ వ్యాప్తం చేయటమనే లక్ష్యాని కనుగుణంగానే యుద్ధాలు చేస్తూ పరిపాలన సాగించారు. సుల్తాను లందరూ ఖలీఫా ఆధిపత్యాన్ని అంగీ కరించారు. ఖలీఫా ప్రతినిధులుగానే తాము పాలన చేస్తున్నామని ప్రకటించారు. ఖలీఫాను తమకు ప్రేరణదాతగా సంభావించారు. ఖలీఫా హత్యకు గురియై, ఖలీఫా స్థానం రద్దు అయిన తర్వాత కూడా ఇక్కడ సుల్తానులు ముద్రించిన నాణాలపై ఖలీఫా పేరు ఉంటూనే వచ్చింది.

ఇంత స్పష్టమైన విషయాన్ని పుస్తకంలో ఎక్కడా పేర్కొనలేదు. ప్రపంచాన్ని అంతటినీ ఇస్లాం తన చెప్పుచేతల్లోకి తెచ్చుకోదల్చుకొన్నదన్న వాస్తవాన్ని ప్రస్తావించనేలేదు. సూఫీల గురించి వ్రాసిన చరిత్ర కూడా ఆత్మవంచనయే. సరిహద్దులను వ్యాపింపజేసే యుద్ధాలలో సూఫీలు ఉండేవారని పేర్కొనబడలేదు. దానికి విరుద్ధంగా సూఫీలు హిందువులను - మీరు మరింత మంచి హిందువులుగా వ్యవహరించండని ఉద్బోధించారని ఈ పుస్తకం ప్రచారం చేస్తోంది.

మొగలాయీల కాలానికి సంబంధించిన వివరణలోనూ ఇబ్బంది కల్గించే వాస్తవాలను దాచేశారు. హిందువుల పవిత్ర తీర్థ యాత్రాస్థలాల పేర్లు మార్చి వేయటమూ, జజియాపన్ను విధించటమూ, బలవంతం మతం మార్పిడులు - ఇవేవీ ప్రస్తావించనేలేదు. ఆనాడు ప్రముఖ స్థానాలలో ఉన్నవారిలో 70 శాతం మంది విదేశీ ముస్లింలనీ పేర్కొనలేదు.

హిందూ పురాణ గాథలను పర్షియన్ భాషలోనికి పాదుషాకోరికపై అనువదించిన విషయం చాలా గొప్పగా పేర్కొన్నారు. దీనివెనుక అసలు ఉద్దేశ్యం పదవులలో ఉన్న

కొద్దిమంది హిందువులను తమ భాషా సాహిత్యాలకు దూరంగా తీసికొని పోవటమని చెప్పనేలేదు. ఇకపోతే హిందూకవులకు, రచయితలకు పాదుషాల పోషణ లభించిన దన్నమాట ఏమేరకు వాస్తవమో నిశితంగా పరిశీలించుకోవటం అవసరం. ఆ కాలానికి చెందిన ప్రముఖ కవి అయిన తులసీదాసుకు - రామ చరితమానస్ వ్రాయడానికి ముందుగాని, తర్వాత గాని, పాలకులనుండి ఏవిధమైన ప్రోత్సాహమూ లభించలేదు. దీన్ ఇ ఇలాహీ గురించిన చర్చ కూడా పెడదారి పట్టించేది గానే ఉంది. అక్బరు కాలంలో ఇస్లామిక్ మత ప్రభావాన్ని తగ్గించటం కొరకు దీన్-ఇ-ఇలాహీ పుట్టుకురాలేదు. హిందుత్వాన్ని నిరాదరించటమే దాని ఉద్దేశ్యమని మార్క్సిస్టుకాని ఒక చరిత్ర రచయిత వ్యాఖ్యానించారు. 50 సంవత్సరాలపాటు పాలించిన ఔరంగజేబు గురించి జహంగీర్, షాజహాన్‌ల అధ్యాయానికి కొనసాగింపుగా మాత్రమే పేర్కొనటం కూడా విద్యార్థులను ఏమార్చే ప్రయత్నమే. అలా అస్పష్టంగా వ్రాసిన . కారణంగానే చదివిన వారికి మరాఠాలు, సిక్కులు, జాట్లు - ఇంతమంది మొగలు సామ్రాజ్యంపై తిరుగుబాటు చేసి సుదీర్ఘ కాలం ఎందుకు పోరాటం చేశారో అర్థం కాకుండా పోతోంది.

అన్నింటికంటే విచిత్రం 123 పుటలున్న పుస్తకంలో జజియా పన్ను ప్రస్తావన 109వ పుటలోనే మొదటి సారిగా వస్తుంది. అప్పుడు కూడా అదేమిటో, ఎందుకో వివరణ లేదు. మరి ఇదే వస్తు నిష్ఠమైన చరిత్ర అని వారు అనేటట్లయితే, వ్యక్తినిష్ఠమైన చరిత్ర మరింకెంత ఆసక్తిదాయకంగా ఉంటుందోగదా!

- మీనాక్షి జైన్, రీడర్, ఢిల్లీ యూనివర్సిటీలో చరిత్ర అధ్యాపకురాలు

**హిందూసగారా జూన్ 2001**

# ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుకు, ప్రాథమిక విద్యకు పట్టిన చీడకు బాధ్యులెవరు?

గజం మిథ్య; పలాయనం మిథ్య అని గతంలోని ఒక ఉపాఖ్యానం. అలాగే ఈనాడు కాషాయీ కరణము ఒక మిథ్య; దానిని ఎదుర్కొనటమూ, నిరోధించటమూ మిథ్యలే. కాగా ఈ నీడలయుద్ధం సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, పాఠశాల విద్యాశాఖామంత్రి కొన్ని విలువైన ప్రకటనలు చేశారు. విద్యా విధానాన్ని రూపొందించటమూ, అమలు పరచటమూ రాష్ట్ర ప్రభుత్వ పరిధిలోని విషయమని, దీనిలోకి కేంద్రప్రభుత్వాన్నిగాని, మరొకరినిగాని చొరనివ్వమని, వారెవరయినా, ఎలాంటి ఆదేశాలు, సూచనలు చేసినా (పార్లమెంటుచే ఆమోదింపబడితే తప్ప) ఖాతరు చేయమని ఆ ప్రకటనల సారాంశం.

ఇంతవరకు అలూ చూలూ లేని కాషాయీ కరణం సంగతి ప్రక్కన పెట్టి ఆంధ్రప్రదేశ్‌లో పాఠశాల స్థాయిలో జరిగిపోతున్న క్రైస్తవీకరణము, అభారతీయకరణముల విషయం పరిశీలిద్దాం. ఎంతో జాగరూకతతో ఆంధ్రప్రదేశ్‌లో విద్యావిధానాన్ని పరిశీలిస్తూ, పరిరక్షిస్తున్న మన ముఖ్యమంత్రి, విద్యామంత్రుల ఆమోదంతోనె ఇవన్నీ చోటు చేసుకొన్నవని భావించవలసి వస్తుంది. దీనికి సూటిగా జవాబివ్వటం వారి బాధ్యత; కనీసమైన మర్యాద.

1. ఆరవ తరగతి తెలుగు వాచకంలో భారత భూమిని నిందిస్తూ ఒక పద్యం ఇలా ఉంది.

*ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుగాని,దుః*
*ఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్*
*మెతుకు విదల్పదీ భరతమేదిని; ముప్పది మూడు కోట్ల దే*
*వత లెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తు లారునే?*

అన్నార్తులై, ఆశ్రయ విహీనులై వచ్చిన యూదులకు, పారశీకులకు, టిబెటన్ బౌద్ధులకు, బంగ్లాదేశ్ కాందీశీకులకు, శ్రీలంక కాందిశీకులకు ఇలా ఎందరెందరికో ఆశ్రయమిచ్చి, అన్న వస్త్రాలిచ్చి అక్కున చేర్చుకొన్నది భారతమేదిని. అటువంటి భారతమేదిని గురించి ఇటువంటి వాక్యాలా పిల్లల చేత చదివించేది?

పేదరికం అన్ని దేశాలలోనూ ఉంది; స్వర్ణాంధ్రప్రదేశ్ పేరుతో స్వకుచ మర్దనం చేసికొంటున్న ఇక్కడ కూడా ఆకలి చావులు, ఆత్మహత్యలూ సంభవిస్తూనే ఉన్నాయి. వీటిని నివారించడానికి ప్రభుత్వమూ, ప్రజలూ కృషిచేయవలసి ఉంది. ఇటువంటి విషయాలపట్ల స్పందించే లక్షణాన్ని విద్యార్థులకు అలవరచవలసి ఉంది. ఇదంతా నిజమే. కాని దీనికొరకని భారత భూమిని (మనకు తల్లి, తండ్రి, గురువూ అయిన మాతృభూమిని) తూలనాడటం నేర్పటం సమంజసమా?

గతంలో శిబిచక్రవర్తి, రాజారంతిదేవుడు, డొక్కా సీతమ్మ, విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు వంటివారి కథలు పాఠాలుగా ఉండేవి. వారిని ఆదర్శంగా తీసికోవాలనే ప్రేరణ వాటిని చదివినవారు అందరికీ కలిగి ఉండకపోవచ్చు. అంతమాత్రాన ఆదర్శాన్ని పూర్తిగా తొలగించి, మసిగీతలు ముందు నిలపటమేనా?

2) 1వ తరగతికి - ఇంకా అక్షరాలే సరిగా నేర్వనివారికి అయిదు ఉపవాచకాలు పెట్టారు. అందులో 3వ ఉపవాచకం భారతీయము, హైందవమూ అయినదంతా కాలబాహ్యమైనదని, పనికి మాలినదని, పాశ్చాత్యమూ, క్రైస్తవమూ అయినది అధునాతనమైనదని, ప్రయోజనకరమైనదని సూచించే ధోరణిలో సాగినకథ. అందులోని పాత్రలపేర్లు, ఆ పాత్రలకు వేసిన వర్ణ చిత్రాలు, సంఘటనలు కల్పించిన తీరు ఇవన్నీ భారతీయ, స్థానీయ, హైందవ జీవన విధానాలను హేళన చేసేవిగానూ, పాపం, పుణ్యం, ప్రపంచ మార్గం తెలియని అయిదారేడుల పసిపాపలను ఆకాశవీధుల్లో ఊహాలోక విహారం చేయించి, మళ్లీ తమ చుట్టూ ఉన్న వాస్తవాలను గమనించుకొని, వాటిని నిరసించేవారుగా తయారు చేసేవిగానూ ఉన్నవి.

3) భాగవతంలో కృష్ణలీలలు ఉన్నవని తెలియని వారుండరు. కాని కృష్ణలీలల పేరుతో కృష్ణుడిని జారుడని, చోరుడని నిందించేవిధంగాను, వ్యాజ్యస్తుతిని పరిచయం చేస్తున్నామంటూ శ్రీ మహావిష్ణువును కించపరిచే విధంగానూ ఉన్న పద్యాలే ఎందుకు ఎంపిక అవుతున్నాయి?

ప్రతిపదార్థ తాత్పర్యాలను బట్టీ పట్టించటమే తప్ప, వాటిలోని అంతరార్థాన్ని వెలికి తీసి చెప్పగల ఉపాధ్యాయులు కరవైన రోజులలో, (ఓరియంటల్ కళాశాలలు మూతబడ్డాయి కదా!) అలా వివరించి చెప్పాలని స్పష్టమైన సూచనలు, శిక్షణ యివ్వలేని స్థితిలో ఇటువంటి నిందాగర్భిత సాహిత్యం ఎందుకు చోటు చేసికొంటోంది?

4) అక్కడక్కడా పొరబాటున దర్శనమిచ్చే గాంధీ మహాత్ముని మినహాయిస్తే తెలుగు పాఠ్యపుస్తకాలలో ఆంధ్రేతరులైన భారతీయుల ప్రస్తావన ఉండటమే లేదు. ఈ ధోరణి ఎక్కడికి దారితీస్తుంది? ఉర్దూ పాఠ్యపుస్తకాలలో మహమ్మదీయేతరుల గురించి ఒక్కపాఠం కూడా ఉండటం లేదు. 40 పాఠాలున్న ఒక ఉర్దూ పాఠ్య పుస్తకంలో "గాంధీజీ మదర్సాను సందర్శించటం" అన్నది అటువంటి అపవాదం. ఇందులోనూ మదర్సాకు ప్రతిష్ఠ తెచ్చే ఉద్దేశ్యమే. ఇటువంటి సంకుచిత ధోరణులకు బాధ్యత ఎవరిదో మంత్రివర్యులు, ముఖ్యమంత్రిగారూ సెలవిస్తారా?

5) పదవ తరగతి తెలుగు వాచకంలో డా॥ అంబేడ్కర్ ఇలా చెప్పినట్లుగా ఉంది. "నాకు రాజనీతి మానవతలు నేర్పినది ఈయనే (జ్యోతిబాపూలే) ; ఆ తరువాతి వారే మార్క్స తదితరులూనూ"

కార్ల్‌మార్క్స వ్యక్తిత్వం నుండి గాని ఆయన రచనల నుండి గాని తాను నేర్చుకొన్నట్లుగా డా॥ అంబేడ్కర్ చెప్పిన ఆధారాలు ఎవరైనా చూపించగలరా? తన జీవితమంతా మార్క్సను తీవ్రంగా వ్యతిరేకించిన అంబేడ్కర్ నోట ఇలాంటి పదాలు ప్రవేశపెట్టటమేమిటి ? ఇది చదువులకు ఎరువురంగు పూయటం కాదా? పదే పదే ఎత్తి చూపిస్తున్నప్పటికీ వీటిని ఎందుకు సవరింపజే యరు?

6) జ్యోతిష విజ్ఞానం విజ్ఞానమేనా, విశ్వవిద్యాలయాల్లో అధ్యయనానికి అర్హమైనదేనా అని మహామేధావులు ఈనాడు చర్చ చేస్తున్నారు. శ్రీనందమూరి తారకరామారావుగారు నెలకొల్పిన తెలుగు విశ్వవిద్యాలయంతో సహా యావద్దేశంలో 15 పైగా విశ్వవిద్యాలయాల్లో జ్యోతిషం ఒక విషయంగా ఉంది. అదలా ఉంచండి. 10వ తరగతి తెలుగు వాచకంలో ప్రవరుడు హిమాలయాలకు వెళ్ళి, ప్రకృతి

రమణీయతను ఆస్వాదించి, కాళ్లకు రాచుకొన్నపసరు కరిగిపోగా ఇంటికి ఎలా వెళ్లాలో తెలియక ఆందోళన చెందిన ఘట్టం ఉంది. ముందు వెనుకలు చూసికోకుండా తొందర పాటుగా ఏ పని చేయరాదని ఈ ఘట్టం మనకు బోధిస్తుందని ఉపోద్ఘాతం వ్రాశారు.

మరి రచయితలు మను చరిత్రలో ముందు వెనుకల్లో ఏముందో చూసుకొన్నారా?

*"దాన జపాగ్ని హోత్ర పరతంత్రుడనేని, భవత్పదాంబుజ*
*ధ్యానరతుండనేనిఁ, బరదార ధనాదులఁగోరనేని, స*
*న్మానము తోడ నన్ను సదనంబున నిల్పు, మినుండు పశ్చిమాం*
*బోనిధిలోనఁ గ్రుంకయమున్న రయంబున హవ్యవాహనా!*

అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవు దేహంబున సన్నిహితుండగుటయు, నమ్మహాభాగుండు పావక ప్రసాద లబ్ధంబగు పవన జవంబున నిజమందిరంబున కరిగె"

ప్రవరుడు ఆందోళన చెందటం మాత్రమేనా పాఠ్యపుస్తకంలో ఉండదగినది, తన తపః ప్రభావంతో అగ్నిని ప్రసన్నుని చేసికొని ఇంటికి చేరుకొన్న విషయం వ్రాయకూడదా? ఇలా పాక్షికమైన, అర్ధ సత్యాలతో పుస్తకాలు నింపటమూ, పైగా వాటికి వంకర మాటలను ఉపోద్ఘాతంగా వ్రాయటమూ ఏమాత్రం సమంజసం?

7) ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు వెనుకబడుతోంది. ఆంగ్లం పెత్తనం చేస్తోంది. ఉర్దూ ముందుకు దూసుకు వస్తున్నది. తెలుగు భాషా సంస్కృతులకు స్థానం కరవవుతోంది. ప్రామాణికమైన గ్రంథాల రచన, అనువాదము, ప్రచురణ ఇటువంటి అత్యంతావశ్యకమైన విషయాలలో భాషాప్రయుక్త రాష్ట్రాలలో మొదటిదైన ఆంధ్రప్రదేశ్ ఏ మాత్రం శ్రద్ధ కనపరచటం లేదు. పైసా విదల్చటంలేదు. సరస్వతీ ప్రార్థన కూడదని నిర్ణయించారట. 'మా కన్నతల్లికి మంగళారతులు' పాడుతున్నారో లేదో తెలియదు గాని తెలుగుదనానికి, భారతీయతకు, హైందవ సంస్కృతికి మంగళం పాడుతున్న ఈ ప్రభుత్వపు వికృత సెక్యులర్ ధోరణిని ప్రజానీకం నిరసించుతున్నారని, వారిముందు తాము దోషులుగా నిలబడవలసి ఉంటుందని గమనించుకోవటం ఎంతైనా అవసరం.

**(జాగృతి నుండి)**

# సెక్యులరిజంపేరుతో మతాలను, విలువలను మట్టుపెట్టటం తగదు

-జె.ఎస్.రాజపూత్, డైరక్టర్, ఎన్.సి.ఇ.ఆర్.టి.

'మేనేజిమెంట్ ఎజుకేషన్'కు పితామహునిగా పేర్కొనదగిన పీటర్ డ్రకర్ తనురచించిన ప్రసిద్ధగ్రంథం "మేనేజిమెంట్ చాలెంజెస్ ఫర్ ది ట్వెంటీ ఫస్ట్‌సెంచరీ" లో ఇలా అంటారు "బౌద్ధికమైన అహంభావం ఏపనీ చేయజాలని అజ్ఞానానికి దారి తీస్తుంది."*(Intellectual arrogance causes disabling ignorance)* దాదాపుగా రెండేళ్ళ క్రిందట దీనిని చదివాను. కాని విద్యా విషయకమైన మార్పుల గురించి చర్చజరుగుతున్న ఈ మధ్యకాలంలో ఈ మాటలు నా మస్తిష్కంలో మళ్లీ మళ్లీ మార్మ్రోగుతున్నాయి. సుప్రసిద్ధులైన మేధావులు; స్వయం ప్రకటిత లౌకిక వాదులూ చాలా బాధపడిపోతున్నారు. విద్యావిషయకమైన మార్పుల గురించి చేపట్టుతున్న చర్యలు దేశంలోని లౌకిక వస్త్రాన్ని నాశనం చేసేస్తాయట. అంటే దేశమే సర్వనాశనమై పోతుందట.

వారు చెప్పుతున్న తర్కాన్ని సులభంగా అర్థంచేసికోవచ్చు. ఇప్పుడు తలపెట్టుతున్న పాఠ్యక్రమం మార్పులలో పిల్లలకు మానవీయ విలువలు తెలియజెప్పాలని, వారు అన్ని మతాల మౌలిక సూత్రాలను తెలిసికొనేలా చేయాలని ప్రతిపాదింపబడిఉంది. వారు బయటకు చెప్పుకోలేని బాధ ఏమంటే, "ఇంత కాలంగా మనం ఇష్టారాజ్యంగా నడిపించుతున్న విద్యారంగంలో ఎవరైనా మార్పులు ఎలా చేయగలరు?"అని. విద్యారంగం యొక్క పగ్గాలు ఎప్పటికీ తమ చేతులలోనే ఉంచుకోవటం మరెవరికీ గాక తమకేప్రత్యేకంగా కేటాయించబడిన హక్కు అని వారి నమ్మకం. తమలోని

ఒకరిద్దరికి మాత్రమే సాధ్యమైన ఈ కార్యాన్ని (విద్యారంగ వ్యవస్థీకరణ) నిర్వహించ గల దక్షులు, విజ్ఞాన వంతులు, శ్రద్ధ గలవారు, సమర్థతగల వారు మరెవరైనా ఎలా ఉంటారు?

వారు మాత్రమే మతాతీత దృక్పథం గలవారు, జ్ఞానవంతులు, ప్రగతి కాముకులు. అభివృద్ధి గురించి, చైతన్యం గురించి వారు మాత్రమే మాట్లాడగలరు. ఈ దేశపు మేధావులను రూపు దిద్దే విద్యారంగ సామ్రాజ్యపు ప్రవేశద్వారాలను దాటి ఎవ్వరూ లోనికి ప్రవేశించటానికి వీలు లేదు అంటూ ఫత్వాలను వారు మాత్రమే జారీ చేయగలరు.

వారిది ఒక భ్రమలతో నిండిన ప్రపంచం. దేశమంతా తమ తోటే ఉంది, దేశానికి ఏమి కావాలో తాము మాత్రమే అర్థం చేసికోగలరు. పిల్లలు నేర్చుకొనడానికి ఏ పద్ధతులు అనుసరించాలో, ఏ సాధనాలు సమకూర్చుకోవాలో, ఈ విషయాలు తమకు మాత్రమే అర్థమవుతాయి; కాబట్టి ప్రజలకు తమపట్ల మాత్రమే విశ్వాసం ఉంది అనేవి వారికి గల భ్రమలలో కొన్ని. విసుగు, కోపము, అవతలివారిని తిట్టుతున్నట్లుగా తీవ్రమైన పరిభాషలో తప్పుపట్టటమూ, నిందించటం ఇవి వారినుండి బహిర్గత మౌతుంటాయి. అందుకు వారికి అనేక మార్గాలున్నాయి. సిద్ధాంతపరంగా వారిని వెనుక వేసికొని వచ్చే జాతీయస్థాయి ఆంగ్ల పత్రికలు, ప్రసారమాధ్యమాలు కూడా ఆ మార్గాలలో ప్రముఖమైనవి. భారతదేశంలోని అన్ని మతాల మూలసూత్రాలను పిల్లలు నేర్చుకోవాలని, అలాగే వివిధ మతాల మధ్య ఉన్న సామాన్య సూత్రాలను ముఖ్యంగా శాశ్వతమైన మానవీయ విలువలైన శాంతి, సత్యము, అహింస, సదాచారము, కరుణ, ప్రేమ మొదలైనవాటిని అన్ని మతాలూ బలపరుస్తున్నవని పిల్లలు గ్రహించాలని ప్రజానీకం కోరుకొంటూ ఉంటే వీరు మండిపడతారు.

మతం - ధర్మం వంటి మాటలు వినబడితే చాలు గొంతు పగిలేలా అరుస్తారు. వారి దృష్టిలో అవి సెక్యులరిజానికి వ్యతిరేకమట! అంటే సెక్యులరిజాన్ని వారు వ్యాఖ్యానిస్తున్న తీరుకు వ్యతిరేకమన్నమాట. భారత రాజ్యాంగం మతములు అన్న మాటను ఉపయోగించకుండా ఏ విధమైన నిషేధమూ విధించలేదన్న సంగతిని వారు మరచిపోతారు. అసంబద్ధమైన అభిమానాలు, పక్షపాతాలు, పూర్వాగ్రహాలు, అనవసరమైన భయాందోళనలు - వీటన్నింటినీ పునఃపరిశీలించుకోవలసిన సమయ మాసన్నమైంది. విద్యా విషయకమైన మార్పుల గురించిన చర్చలలో నుండి ఒక ఆచరణీయమైన దృక్పథం రూపొందించుకొనడానికి కూడా ఇది తగిన సమయం.

మతాలు ఒక వాస్తవం. అవి ఇప్పుడు ఉన్నవి. ఇకముందు ఉంటాయి కూడా. అవి ఎక్కడకీపోవు. భారతీయ సమాజం మతంతో, ధర్మంతో పెనవేసికొన్న సమాజం. భారత ప్రభుత్వం లౌకిక స్వభావం గలది. ఈ రెండింటికి మధ్య వైరుధ్యమేమీ లేదు. ఒకప్పుడు జవహర్‌లాల్ నెహ్రూని ప్రధానమంత్రిగా మీరు ఎదుర్కొంటున్న అతిపెద్ద సవాలు ఏమిటని అడిగితే, "న్యాయపూర్ణమైన పద్ధతులద్వారా, న్యాయపూర్ణమైన ప్రభుత్వ వ్యవస్థను నిర్మించట"'మని ఆయన జవాబిచ్చారు. "మతంతో, ధర్మంతో ముడిపడి ఉన్న దేశంలో లౌకిక ప్రభుత్వాన్ని నిర్మాణం చేయటం కూడా" అని జోడించాడు. ఎంత గొప్పగా భవిష్యత్తును ఊహించాడు ఆయన!

నిజంగానే ఈ సవాలు చాలా జటిలమైనది. ఈనాటికీ దీని పరిమాణం ఏమీ తగ్గలేదు. ఒకరకంగా నెహ్రూ కాలానికి కంటే ఇప్పుడు మరింత పెద్దదయిందేమో కూడా. అసలు సమస్యను నిర్లక్ష్యం చేసిన కారణంగాను, విద్యారంగంలో సరియైన విధానాల రూపకల్పన చేసి అందించ వలసిన విషయాలను అందించటంలో విఫలమైన కారణంగాను దేశం ఎంతో నష్టపోయింది. ఇప్పటికీ ఎంతో మూల్యం చెల్లిస్తోంది. గుజరాత్ దీనికి తాజా ఉదాహరణ.

అన్ని మతాలు, పంథలూ విశిష్ట గుణసంపన్నమైన జీవితం గడపడానికి ప్రేరేపించుతాయి. అందరు మానవుల ఏకత్వాన్ని గుర్తించి గౌరవించటమూ శాంతిని, సామరస్యాన్ని పాటించటమూ ఆ విశిష్టగుణ సంపన్నమైన జీవితంలో ఒక భాగం. మరి మతాల ఈ సదుద్దేశాన్ని మరుగుపరచి, వాటి సత్యమైన ఆచరణను అడ్డుకొనడానికి యత్నిస్తున్న శక్తులు ఎలాంటివి?

హింసను, ఘర్షణలను నివారించి, మానవ సమూహాల మధ్య శాంతిని సాధించేందుకు విశ్వవ్యాప్తంగా ఎడతెగని ప్రయత్నాలు జరుగుతూ ఉన్నాయి. ఐక్యరాజ్య సమితి ఏర్పడింది. ఒక వ్యక్తి తనతోతాను శాంతియుతంగా మన గల్గటమే కష్టం. యుద్ధాలు మొదటగా మెలకెత్తేది మానవమస్తిష్కాలలోనే కాబట్టి శాంతి పరిరక్షణకు అవసరమైన యత్నం కూడా మానవ మస్తిష్కంతోనే ప్రారంభం కావాలి. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత కూడా ప్రపంచ వ్యాప్తంగా 2.7 కోట్ల ప్రజలు హింసా కాండలోనో, సంఘర్షణలలోనో అపనమ్మకాల కారణంగానో మరణించి ఉంటారని అంచనా.

మండుతున్న వార్తలలో గుజరాత్ ప్రముఖ స్థానంలో ఉంది. 2001 జనవరి 26న కూడా విషాదకర్త వార్తలకు గుజరాత్ కేంద్ర బిందువైంది. ఒక ఊళ్లో గణతంత్ర దినోత్సవ సందర్భంగా ఉత్సాహంగా శోభాయాత్రలో నడుస్తున్న వందలాది విద్యార్థులు

ప్రక్కన ఉన్న భవనాలు కూలిపడిపోగా, ఆ శిథిలాలలో చిక్కుబడి చనిపోయారు. అది ఒక ప్రకృతి వైపరీత్యం. దేశమంతా విలపించింది. ఒక ఏడాది అనంతరం ఇప్పుడు పిల్లవాళ్లను రైలుపెట్టెల్లోను, వారి స్వంత ఇండ్లలోనూ, ఆటస్థలాలలోనూ తగులబెట్టున్నారు. వారి తల్లిదండ్రుల స్నేహితుల కుటుంబసభ్యుల కనులముందే ఈ ఘాతకాలు జరుపుతున్నారు. వారి స్నేహితులూ, ఇరుగుపొరుగువారే ఈ ఘాతకంలో స్వయంగా పాలు పంచుకొంటున్నారేమో కూడా! విలువలు లోపించటంలో ఎంతటి అధోగతికి దిగజారుతున్నాం! శరణార్థుల శిబిరాలలో బ్రతుకు వెళ్లమారుస్తున్న పిల్లలు భవిష్యత్తు ఏమిటి? ఈ శిబిరాలలోనే కన్ను తెరుస్తున్న పసికందుల మాటేమిటి?

ఇతరత్రా కూడా బాధలననుభవిస్తున్న పిల్లలు కొల్లలుగా ఉన్నారు. ఎన్ని చట్టాలున్నప్పటికీ, పిల్లల అమ్మకాలు జరుగుతూనే ఉన్నాయి, వారి వయస్సుకు, శరీర సామర్థ్యానికి సాధ్యంకాని క్లిష్టమైన, బరువైన పనులు పిల్లలు చేయవలసి వస్తోంది. వారికి విద్య లభించటంలేదు; అడుగడుగునా అవమానాలు అత్యాచారాలు ఎదురవున్నాయి. ఒక్కపిల్లవానికి న్యాయం జరగకపోయినా, దానిని న్యాయపూర్ణ సమాజమని అనజాలం గదా!

1994లో భారతీయ విద్యా భవన్‌లో చేసిన ఉపన్యాసాన్ని నానీపాల్కీవాలా ఇలా ప్రారంభించారు. "ఈ జాతి సమైక్యతా సూత్రము, ఈ జాతికి గుర్తింపునిచ్చే సూత్రము ఎక్కడ ఉందంటే వివిధ మత విశ్వాసాల మధ్య సమన్వయంలో, అన్ని మతాల, పంథల మౌలిక ఏకాత్మతను ఏమరకుండా వ్యవహరించటంలో, అదే ఈ జాతికి గుండెకాయ' ' ఆ తరువాత చెప్పి మాట మరింత ప్రాధాన్యం కలది, ఇప్పటి మన సమయానికి చక్కగా వర్తించేది "జాతీయ సమైక్యత పౌరుల హృదయాలలో ఉదయిస్తుందని స్పష్టమే. అది గనుక మరణించిందా, ఏ ప్రభుత్వమూ, ఏసైన్యమూ దానికి రక్షించజాలవు."

వివేకానందుడు, గాంధీజీ, అరవిందయోగి, జాకీర్ హుస్సేన్ తదితరులు విపులీకరించిన భారతీయ మనస్తత్వాన్ని అవగాహన చేసికొనడాన్ని ఇన్ని సంవత్సరాలుగా మనం నిర్లక్ష్యం చేయటమే నిజమైన విషాదం. వివిధ మతాలలో ఉద్భవించిన జాతీయనాయకులు, మహాపురుషులు జాతీయ సమైక్యతను సాధించటం తమ నైతిక బాధ్యతగా, ఆధ్యాత్మిక బాధ్యతగా, శాస్త్రోక్తమైన బాధ్యతగా గుర్తించిన తర్వాత జాతీయ స్థాయిలో దానిని సులభంగా సాధించగలరు. ఇది మానవాళిపట్ల వారి కనీస కర్తవ్యంగా వారిచే గుర్తింపజేయాలి. దీనికి ఒకే ఒక్కనమూనా ఉండదు; లక్ష్యానుగుణంగా చేసే ప్రయత్నాలలో వైవిధ్యాలను అంగీకరించ వలసి ఉంటుంది. కాపాడు కోవలసి ఉంటుంది. వైవిధ్యంలో నుండి ఏకత్వాన్ని దర్శించేందుకు నిరంతర ప్రయత్నం జరుగుతూ ఉండాలి.

ప్రపంచానికి నైతిక నాయకత్వం భారత దేశం వహిస్తుందని అరవిందయోగి భవిష్యత్తును ఊహించి చెప్పారు. ఈ శతాబ్దంలో గొప్ప సమైక్యతా సాధకుడైన మహాత్మాగాంధీ సూచించిన మార్గాన్ని అనుసరించినపుడే భారతదేశం ఈ పాత్ర వహించగల్గుతుంది.

"మన ప్రతి చర్యలోనూ ధర్మం ఓతప్రోతమై ఉండాలి. ఇక్కడ ధర్మం అంటే ఒక వర్గం అనుసరించే ఆరాధనా విధానమని కాదు. ప్రపంచాన్ని నైతికంగా శాసించే క్రమం పట్ల విశ్వాసమే ధర్మం. అది కంటికి కనబడనంతమాత్రాన అవాస్తవికంకాదు. ఈ ధర్మం హిందూమతాన్ని, క్రైస్తవ మతాన్ని, మహమ్మదీయ మతాన్ని, ఇతర మతాలను అధిగమించిన తత్వం. ఇది వాటినన్నిటిని సమన్వయ పరుస్తుంది; వాటికి అస్తిత్వం సమకూర్చుతుంది" ఒక్క గాంధీమాత్రమే ఇలా చెప్పగలడు. ఈనాటి సంక్షోభాన్ని అధిగమించ గల మార్గాన్ని ఆయన ఒక్క వాక్యంలో చెప్పాడు. "ఈనాడు కావలసింది ఒక మతం కాదు. వివిధ మతాల, పంథల విశ్వాసుల మధ్య పరస్పరం గౌరవం, సహిష్ణత"

ఇసుకలో తలదూర్చే ఉష్ట్రపక్షి విధానాలు మతాల విషయంలో పని చేయవు. నిజమైన లౌకిక వాదం మాత్రం ఫలితాల నిస్తుంది. సర్వధర్మ సమభావాన్ని గాని, సర్వధర్మ సమాదర భావాన్ని గాని అపహాస్యం చేసేందుకు ఎవరినీ అనుమతించ కూడదు. దేశంలో వివిధ మతాల, పంథల మధ్య, సమైక్యతను పటిష్టం చేసే చిహ్నాలు వివిధ కులాల, సమూహాల, మతాల, పంథల నిర్వహణలో అసంఖ్యాకంగా ఉన్నాయి. అవి శతాబ్దాల తరబడి సమైక్యతా బంధాలను దృఢతరం చేస్తూ వస్తున్నవి. ఏదో ఒక సిద్ధాంత జాడ్యం ఆవరించిన కొందరు స్వయంప్రకటిత మేధావులు మతమనో, ధర్మమనో మాటవినిపించగానే చిర్రెక్కిపోయినంత మాత్రాన, సాంఘిక సమైక్యత సాధించడానికి తోడ్పడే ఆధార స్తంభాలను నిర్లక్ష్యం చేస్తామా?

లౌకిక వాదం (సెక్యులరిజం) పేరుతో విలువలను నీరు కార్చటమో, మట్టుబెట్టటమో చేయతగదు. యువతరం వివిధ మతాల, పంథల మూల సూత్రాలను, వాటి మధ్య మౌలిక ఏకాత్మతనూ తప్పక గ్రహించాలి. మానవ జీవనముల్యాలను దెబ్బతీసే యత్నాలను ఎదుర్కోవాలి. విద్యలో శాస్త్రోక్త విషయాలకు, రసాత్మకమైన విషయాలకు, ఆధ్యాత్మిక విషయాలకు సముచితస్థానం తప్పక కల్పించాలి. సాంఘిక సమైక్యతను. సామరస్యాన్ని సాధించి, వాటి ద్వారా వివిధ జాతుల సమూహంలో తనకు గౌరవమయస్థానాన్ని సంపాదించు కొనడానికి భారతదేశం దీర్ఘకాలిక ప్రణాళికను రూపొందించు కోవాలి.

# ముగింపు మాటలు....

గత నాలుగేండ్లుగా విద్యారంగ సంస్కరణల గురించి జరుగుతున్న తర్జన భర్జనలు, సెప్టెంబరు, అక్టోబరు మాసాలలో వెలువడిన సర్వోచ్చన్యాయస్థానం తీర్పులూకలసి మన విద్యావిధానాన్ని,విద్యారంగాన్ని ఒకమలుపు త్రిప్పబోతున్నవి. ఇవి ఈ దేశ ప్రజానీకాన్ని మేల్కొనవలసిందిగా, సమాజంపట్ల, రానున్న తరాలపట్ల తమకర్తవ్యాన్ని నిర్వహించవలసిందిగా పిలుపునిస్తున్నవి.

గతంలో అన్నీ ప్రభుత్వమే చేస్తుందని అనుకొంటూవచ్చాం. ప్రభుత్వాలు చేయగలిగింది పెద్దగాలేదని ప్రజలు అనుకోవటమేకాదు, ప్రభుత్వాలే స్పష్టంగా ప్రకటిస్తున్నాయి. ప్రయివేటీకరణ అనే ప్రక్రియను చాలావేగంగా అమలుచేస్తూ ప్రభుత్వాలు చేతులు దులుపుకొంటున్నాయి. మరిప్పుడు పిల్లలను విద్యావంతులను చేయడానికి ప్రజలే నడుంకట్టాలి. తమ నాగరికతా సంస్కృతులకు దూరంకానిరీతిలో వారు విద్యాబుద్ధులు గ్రహించేవిధంగా ఏర్పాట్లు చేయాలి.

విద్యాసంస్థలను ఏర్పరచుకొనే స్వేచ్ఛ,లేదా హక్కు అల్పసంఖ్యాక వర్గాలకే ఉంది; అధిక సంఖ్యాకులుగా పరిగణింపబడేవారికి లేదు అనే భ్రమ ఇప్పుడు తొలగి పోయింది. ఎవరైనా విద్యాసంస్థలు ప్రారంభించవచ్చు. పారదర్శకంగా ఉండేవిధంగా /వాటిని నిర్వహించుకోవచ్చు. సేవాభావంతో,తమ భాషా సంస్కృతుల వికాసం లక్ష్యంగా పెట్టుకొన్నవారు ముందుకు వచ్చి విద్యావ్యాప్తిని, ఉపాధికల్పనను, దేశం యొక్క పారిశ్రామికీకరణాన్ని తమ సంస్కృతిక లక్ష్యాలతో మేళవించి, పోటీ ప్రపంచంలో నిలబడగల దక్షతతో శ్రమించి ఎంతైనా సేవచేయవచ్చు. సంకల్పంగాని, చొరవగాని కొరవడి ఆ పనిలో వెనుకబడిపోతే, ఈ అవకాశాన్ని మళ్లీ మతవ్యాప్తి లక్ష్యంగా గలవారు దొరకబుచ్చుకొనే ప్రమాదం లేకపోలేదు. అలాగే లాభార్జన దృష్టిగలవారు కూడా ఇప్పటి పరిస్థితిలోనూ లొసుగులను కనిపెట్టి సమాజాన్ని బలహీనపరుస్తూ తాము సొమ్ము చేసుకొనే పద్ధతులను అవలంబించవచ్చు.

ఇటువంటి విషయాలను ప్రభుత్వాలే నిరోధిస్తాయనే నమ్మకం దాదాపుగా ఎవరికీ లేనేలేదు. గత యాభైఐదు సంవత్సరాల పైబడిన స్వతంత్ర భారతదేశపు అనుభవం అది. ఒకవేళ ప్రభుత్వాలు గనుక చొరవ తీసికొన్నట్లయితే న్యాయమూర్తి ధర్మాధికారి అభిప్రాయంలో ధ్వనించిన విధంగా అల్పసంఖ్యాక వర్గాలు నడిపే పాఠశాలల్లోకూడా గిరిగీసికొని వ్యవహరించే ధోరణికి భిన్నంగా వైవిధ్యభరితమైన మతభావనలగురించి సదవగాహన కలిగించే దిశలో బోధనలు సంభవమౌతాయి. దేశమంతటా విశాల భావనలు నిండి సాంఘికంగా సామరస్యపూర్వకమైన వాతావరణం నెలకొనేందుకు మార్గ మేర్పడుతుంది. అలాగాక ప్రభుత్వాలు నిష్క్రియంగానే ఉండటమూ, ప్రజానాయకులు తమ సొంత యింటిని మాత్రమే చక్కబెట్టుకొనే కృషిలో నిమగ్నులై ఉండటమూ కొనసాగితే, లాభార్జనా దృష్టిగలవారూ, మతవ్యాప్తి లక్ష్యంగా గలిగినవారు చెట్టాపట్టాలు వేసికొని అల్పసంఖ్యాక వర్గాల ముసుగులో క్రొత్తగా కనిపెట్టిన లొసుగులతో దేశాన్ని కొల్లగొట్టటం కొనసాగుతుంది.ఎంతటి సదుద్దేశాలు ఉన్నా, ఆ పరిస్థితులలో న్యాయస్థానాలు సమాజానికి కలిగించగల రక్షణ చాలాపరిమితంగానే బహుశా నగణ్యంగానే ఉంటుంది.

**ఆనోభద్రాః ఋతవః యాన్తు విశ్వతః**

(ఉదాత్తమైన భావాలను అన్నిదిశలనుండీ రానీయండి) అనివేదాలు ఘోషించిన భావనను హిందువులు అమలు చేస్తున్న కారణంగానే ఈ దేశం ఒక మతంగీసిన గీతకు లోబడి పోకుండా లౌకిక ప్రజాస్వామ్యవ్యవస్థను ఏర్పరచుకొన్నదని న్యాయమూర్తులు ప్రశంసించినందుకో, **ఏకంసత్, విప్రాః బహుధా వదంతి** (సత్యమూ,శాశ్వతమూ అయినది ఒక్కటే,దానిని పండితులు అనేకరీతులలో ప్రవచిస్తున్నారు) అంటూ వైవిధ్యభరితమైన మత భావనల గురించి సదవగాహన కలిగించే బోధన జరగాలని న్యాయమూర్తులు సూచించారనో పొంగిపోవటంతో ఏమీ ప్రయోజనం ఉండదు. ఇప్పుడు ఏర్పడిన పరిస్థితికి తగిన విధంగా స్పందించి మంచి పాఠశాలలను, విద్యాసంస్థలను నెలకొల్పడానికి, ప్రోత్సాహ ప్రోద్బలాలను అందించడానికి ముందుకు వచ్చినపుడే ఈ పరిణామాల సత్ఫలితాలను పొందగల్గుతాము.

**- సంకలన కర్త**